# అభిప్రాయాలు

భారతి

రహితాపురం జమీందారుని పశువులశాల ఒక రాష్ట్రము. అచ్చటి పశువుల ఏర్పాటులు, తిరుగుబాటు, పరిపాలన, ప్రచారము, సభలు, కార్యక్రమము నాయకుల స్థాపన, ఎన్నికలు, ఈ మొదలైన రాష్ట్ర రాజకీయ వ్యవహారాలన్నీ వర్ణింపబడినవి. పద్ధతులలోను, నడవడిలోను ఈ రాష్ట్రము చైనానున్నూ, రష్యానున్నూ, సన్నిహిత సామ్య సంబంధములు ఉన్నట్లు చదువరులకు తోచకమానదు .. ఇట్టి గ్రంథాలు ఆంగ్ల భాషలో కూడా చాలా అరుదుగా ఉన్నవి. ఆంధ్రవాఙ్మయములో మరికొంత చే.. అందుచేత ముఖ్యముగా పఠనీయము.

స్వతంత్ర

“పశువుల దివాణం” చదవడం పూర్తిచేసిన తరవాత ఒక ప్రగాఢమైన జిజ్ఞాస పాఠకుడిలో రేకెత్తుతుంది. ఈ శతాబ్దపు రాజకీయ సిద్ధాంతాలు మానవజీవితాన్ని ఎక్కడికి తీసుకు వెళుతున్నాయి? పశుత్వానికన్న అధమాధమమైన స్థితికా? లేక భూలోకస్వర్గానికా? ... ఆ ప్రశ్నకు సమాధానమే యీ “పశువుల దివాణం” అనే వ్యంగ్య రచన ... మూలంలోని కళావైదగ్ధ్యాన్ని [illegible] నేర్పుగా తెలుగులోకి తీసుకురాగలిగాడు .. ఆర్వెల్ వ్రాసిన ఇటీవలి పుస్తకం “1984” యిదే రీతిని తెలుగులోకి యీయన తీసుకురాగలిగితే తెలుగులో రాజకీయమైన వ్యంగ్య రచనలకు దోహదం లభిస్తుంది ......

కిన్నెర

పంచతంత్రంలోని జంతువులు సాంకేతిక చిహ్నాలు. అలాగే జార్జి ఆర్వెల్ “పశువుల దివాణం” లోని పశువులు కూడా... ప్రజాసమూహాన్ని నుంచుకు నడిపేవాడు నాయకుడు. కాని నాయకుడి లక్ష్యం ప్రజాక్షేమం కానప్పుడు తయారయేది “పశువుల దివాణం”

... ... రాజకీయాల గురించి పెద్దకబుర్లు చెప్పేవారు ఈ పుస్తకం నిండు మనస్సుతో చదివితే జ్ఞానోదయం కలగడానికి అవకాశం వుంది.

చిత్రాంగి

ఒకవిధంగా వివిధ రాజకీయ సిద్ధాంతాలకూ మధ్య యేర్పడ్డ సంఘర్షణయే ఈ గ్రంథంలోని ప్రధానాంశం......

బాల

ఈ కథలో అన్నీ జంతువులే వస్తాయి. అన్నీ ఏకమై మనుష్యుల్ని పడత్రోసి జంతువులరాజ్యం స్థాపిస్తాయి! పందుల రాజ్యంలో మిగిలిన జంతువులకి నోరే వుండదు.

ఇప్పుడు మనుష్యులు ఏలుతూన్న రాజ్యాలు కూడా ఇంచుమించు పశువుల దివాణంలాగే వున్నాయని తెలుస్తుంది!

మాలి

ఇలాంటి ఉద్గ్రంథము ఈమధ్యకాలంలో వెలువడలేదు. ఇది తెలుగు పాఠకులకి అందించిన శ్రీ జనమంచి రామకృష్ణగారి కృషి ప్రశంసనీయమైనది.

# పశువుల దివాణం

ఊహాకల్పితమైన

పెద్దకథ

మూలం:

జార్జి ఆర్వెల్.

అనువాదం:

జనమంచి రామకృష్ణ.

# జార్జి ఆర్వెల్‌కు కృతజ్ఞతతో

Barnhill, Isle of Jura,
Argyllshire,
Scotland,
30-4-47.

Dear Mr. Ramakrishna,

Many thanks for your letter of March 22nd, which only got to me last week.

I should be delighted for "Animal Farm" to be translated into Telugu. The copyright is mine, so you can deal with me directly. I do not want any payment, but I should be obliged if you could send me two or three copies of the translation when it is published.

Yours truly,
(Sd.) GEORGE ORWELL.

వలయువారు:
జనమంచి రామకృష్ణ,
3, లలితాపురం వీధి,
రాయపేట,
మద్రాసు 14.

వెల : రూపాయి

సందేశం వినేందుకు జంతువులన్నీ ఒక గంట నిద్రకూడా త్యాగం చేసేందుకు నిశ్చయించాయి.

పంది వచ్చి పశువుల సావిడికోమూలగాఉన్న తిన్నెమీద కూర్చుంది. దాని వయస్సు పన్నెండు సంవత్సరాలు. వార్ధక్యం వచ్చినా, బాగా లావెక్కినా, ఆ దర్జా, ఆ హుందాతనం మాత్రం దానిని విడిచిపోలేదు. తెలివి కళ్లలో తళుక్కుమంటూంది. జంతువులన్నీ సమావేశమవడం ప్రారంభించాయి. మొట్టమొదట వచ్చినవి మూడుకుక్కలు. తర్వాత పందులు. అవి ఆతిన్నెకిందగా గడ్డిలో కూర్చున్నాయి. కోళ్లువచ్చి పశువులసావిడి కిటికీకమ్ములమీద కూర్చున్నాయి. పావురాలు సావిడికప్పు కమ్మీలమీద కూర్చున్నాయి. గొర్రెలూ, మేకలూ, ఆవులూ, గేదెలూ పందులవెనకగా నడుం వాల్చి నెమరు వేయడం మొదలెట్టాయి. గుర్రాలు రెండూ - పంచకల్యాణి, జాకీలు- నెమ్మదిగా లోపలికి నడిచివచ్చి, ఒకసారి చావిడంతా పరకాయించి చూసి నిలబడ్డాయి. గుర్రాల వెనకాతలే పెంకితనంగా నడుస్తూ కోడెదూడ సింహాచలం వచ్చింది. ముసలి ఆంబోతు వెంకన్న కూడా ఆ వింత చూద్దామని వచ్చింది. దివాణంలోని జంతువు లన్నింటిలోనూ ముసలి దీ వెంకన్న. ముసలితనంతోపాటు చికాకూ, నిరాశా బాగా అలవాటుచేసుకుంది. వెంకన్న ఎప్పుడూ నోరు విప్పిమాట్లాడదు. ఒక వేళ ఎప్పుడేనా మాట్లాడితే ధ్వనించేది నిరాశే. దేముడు తోక యెందు కిచ్చాడంటే, ఈగలువాలకుండా తోలుకుందు కంటుంది. పైగా యెప్పుడో ఒకప్పుడు, ఆ తోకా ఉండదు. ఈ ఈగలబాధా ఉండ దంటుంది. తక్కిన జంతువులతో కలిసి ఒక్కనాడేనా సలా సాగా వెంకన్న కాలంగడిపి యెరగదు. కాని పంచకల్యాణితో మాత్రం అతి స్నేహంగా ఉంటుంది. వెంకన్నా, పంచకల్యాణీకలిసి మేత మేసేందుకు పోవడం కద్దు.

రహితాపురం జమీందారు వెంకన్నదొరగారు ఎప్పుడూ బస్తీల లోనే మకాం చేస్తూంటారు. తమ ఖర్చుకి డబ్బు కావలసి వచ్చినప్పుడుమాత్రం, చుట్టపుచూపుగా రహితాపురం రావడం, బేరసారాలు చూచుకుని, వచ్చినంతా రాబట్టుకుని, మళ్లా పట్నం వెళ్లపోడం అలవాటు.

జమీందారుగారి దివాణంమాత్రం ముసలిరత్తయ్య, ఎంతో జాగ్రత్తగా, వెయ్యికళ్లతో కాపాడుతూ కాలం గడుపుతున్నాడు. ఏపనైనా స్వంతంగా చేసుకునే పోతాడుగాని పాలేరాళ్లమీదగాని, దివాణం నౌకర్లమీదగాని వదలిపెట్టడు.

ఆ వేళ రాత్రి రత్తయ్య అలవాటుచొప్పున దివాణంతలుపులూ అవీ జాగ్రత్తగా గడియలువేసి, పశువులూ, ఇంకా ఇతర పెంపుడు జంతువులూ ఉండే సావిడిలోకి వెళ్లి, అన్నిటికీ పాలేరాళ్లు మేతా, నీళ్లూ సరిగ్గా పెట్టిందీ లేందీ చూశాడు. ఎప్పట్లాగే ఎవరి పనులు వారు చేశారని గ్రహించి, నిద్రపోయేందుకు తన గది చేరుకున్నాడు. దీపం ఆర్పి రత్తయ్య నిద్రపోయాడు.

రత్తయ్య పడకగదిలోని దీపం ఆరిపోవడం పశువుల సావిడిలో కొంత అలజడి కలిగించింది. దివాణంఅవతల ఉంటూన్న మొరకల గూడెంలోని ఒక ముసలిపంది క్రితంరాత్రి విచిత్రమైన కల గన్నట్లూ, ఆ కలగురించి తాను దివాణం జంతువులకి తెలిపేందుకు ముచ్చట పడుతూన్నట్లూ వార్త వచ్చింది. రత్తయ్య నిద్రపోగానే జంతువులన్నీ కల వినేందుకుగాను పశువుల సావిడిలో విడిది చేసేందుకు నిశ్చయించాయి. ముసలిపంది అంటే దివాణం జంతువులకి ఎంతేనా గౌరవం.

పోయేంత పని చేయిస్తున్నారు. మన మేమిా యంత్రాలం కాము. మనకీ నోరూ, ముక్కూ, చెవులూ—సమస్త ఇంద్రియాలూ ఉన్నాయి. కాయకష్టంతో త్వరితంగా, మనకి వార్ధక్యం సంప్రాప్తమౌతూంది. వార్ధక్యదశలో వారు మన మొహంచూడరు. మన బ్రతుకులు వారికి ఎందుకూ పనికిరాని బరువైపోతున్నాయి. అప్పుడు, వచ్చిన కాడికి మనని కసాయివానికి తెగనమ్మివేస్తున్నారు. ఒక్క జంతువుకైనా సుఖమంటే యేమిటో తెలుసునా ? జంతువుకి సంవత్సరం వయస్సు రావడం తడవుగా, అది సుఖానికీ, విశ్రాంతికీ దూరమైపోతూంది. అన్నిటికన్నా, స్వతంత్రంగా జీవిస్తూన్న ఒక్క పెంపుడు జంతువుని చూపండి ! ప్రతి పెంపుడుజంతువూ, స్వాతంత్ర్యం పోగొట్టుకొని హేయమైన మనుగడ సాగిస్తూంది. దాస్యశృంఖలాబద్ధులమై ఉన్నాము మనమంతా.

"తోటిజీవి కిది తగునా ? భగవంతుని దృష్టిలో అందరూ సమానులే ! మనదేశం రత్నగర్భ; శ్యామలసస్యభరితమైనది. అటువంటి దేశంలో ఉన్న ప్రాణికోటి ఎందుకు సుఖ మనుభవించడం లేదు ? నేస్తాలూ ! మనదేశం మాట అటుంచి ప్రస్తుతం ఈ జమీాందారు దివాణం చూడండి. ఈ ఒక్క జమిాందారీమిాదా పన్నెండు గుర్రాలూ, ఇరవై ఆవులూ, పాతిక గేదెలూ, వందలకొద్దీ మేకలూ గొర్రెలూ—తదితర జంతువులూ సుఖంగా బ్రతకవచ్చును. అటువంటప్పుడు, ఈ దాస్యపు జీవితం ఎందుకు గడపాలీ అంటాను ! కారణం తెలుసా ? మనం, ఎముకలు చిట్లంకట్టేలా పనిచేయడం, ఆ ఫలితమంతా మానవులు అనుభవించడం జరుగుతూంది. ఈనాడు మనం అధోగతిపాలైనా మంటే, మానవులే కారకులు. మనకు మానవుడు శత్రువు. మానవునితో సంబంధం తెంచుకున్నా మంటే, ఆకలికీ, కాయకష్టానికీ స్వస్తి చెప్పా మన్నమాటే !

"కష్టపడకుండా కడుపు నింపుకునేది మానవు డొక్కడే ! మానవుడు పాలివ్వడు; గుడ్లు పెట్టడు; అరక కట్టుకు దున్నడానికి దుర్బలుడు; జోరుగా పరుగెత్తలేడు;—ఇన్ని దౌర్బల్యాలతో, మన

అక్కడ చేరి బాతులన్నీ నిద్రపోయాయి. హడావిడి చేసుకుంటూ, జమీందారుగారి ముద్దుల గుర్రంపిల్ల పంకజాక్షి కలకండ తింటూ లోన ప్రవేశించింది. పంకజాక్షి మల్లెపూవులా తెల్లగా ఉంటుంది. నొసట చుక్కా, తలకి ఎర్రటి రిబ్బనులు కట్టుకుంది. అన్నింటికంటె ఆఖర్న పిల్లి వచ్చింది. వెచ్చటిస్థలంకోసం వెతికి, చివరకు జాకీ, పంచకల్యాణీల మధ్య ఇరుక్కుని, అది వెచ్చగా నిద్రపోయింది. ముసలిపంది ఉపన్యాసాన్ని మాత్రం సరిగ్గా వినకండా, మధ్యమధ్య 'మ్యావ్' మంటూ గొడవచేయడం మొదలెట్టింది.

రావలసిన జంతువులన్నీ వచ్చి సమావేశంఅవడం చూసి, ముసిలిపంది నిలబడి గొంతు సవరించుకుని—

"నేస్తాలూ! నేను నిన్నరాత్రి కన్న కలనుగురించి మీరంతా వినేవుంటారు. ఒకవేళ అందరూ వినకపోయినట్లైతే ఆ కలగురించి తర్వాత విన్నవిస్తాను. అంతకంటే ముఖ్యమైన విషయం చెప్పదలచు తున్నాను. నేను ముసలిదాన్నైపోయాను. ఆట్టేకాలం మీ అందరి తోనూ ఉండ ననుకుంటాను. కాని, నేను చనిపోయేముందు, నా పన్నెండేళ్ల జీవితానుభవాన్ని చెప్పదలుచుకున్నాను. నా జాతికి నేను చేయవలసిన సేవ అంతమాత్రమే. నా గుంటలోపరుండి ఇంతకాలం ఒకే విషయాన్నిగురించి దీర్ఘంగా ఆలోచించాను. చివరకు ఆ రహస్యం తెలిసింది. నా చిరంతనసాధన ఫలించింది. జీవితరహస్యం తెలుసుకున్నాను.

"నేస్తాలూ! మన జీవితరహస్య మేమిటి? ఈప్రశ్నకి సమాధానం గ్రహించామంటే, మన మూగజీవాలలో చైతన్యం కలిగిందన్నమాటే. సావధానంగా వినండి! మనలో ప్రాణముందా? మనం జీవిస్తూన్నది ఒక జీవితమేనా? ప్రాణికోటిలోకల్లా, నీచంగా కాయకష్టపడి, పూర్ణాయుర్దాయానికి నోచుకోకుండా, మనం తనువులు చాలిస్తున్నాము. సమస్త ప్రాణికోటి మాదిరిగానే మనమూ పుట్టాము. కాని ఊపిరితో బ్రతికేటంతమట్టుకే, మానవులు మన కింత తిండి పెడుతున్నారు; ఇంక మనలో బలిష్ఠులున్నారు. వారిచేత, ఎముకలు విరిగి

జంతుజాలంమీద అతను ఆధిపత్యం వహిస్తున్నాడు. జంతువులచేత పని చేయించుకుంటున్నాడు. మలమల మాడి చచ్చిపోనంతమట్టుకే ఇంత తిండి పెడుతున్నాడు. మిగతా ఫలాదాయ మంతా స్వంతానికి ఉంచుకుంటున్నాడు. మన కాయకష్టం మూలాన్నే భూమి సాగు అవుతూంది; మనం విసర్జించే మలమూత్రాదులు పొలాలకి మంచి ఎరువౌతున్నాయి. ఇంత కష్టపడి మనుగడ సాగించినా, మనం కడుపు మాడ్చుకునే జీవిస్తున్నాము. సోమరి ఐన మానవునికోసం మనం ఎందుకు కష్టపడా లంటాను? మీలో ఒక్కరికైనా 'నాది' అని చెప్పుకోతగ్గ ఒక్క సెంటు భూమైనా ఉందా? చివరకు మీరు నడుం వాల్చి పడుకునే మేరకూడా మీదికాదు. నాఎదురుగుండా ఉన్న ఓ ఆవులూ! గేదెలూ! మీరు క్రితం సంవత్సరం ఎన్నివేల కుంచాల పాలిచ్చారు? ఆ పాలతో మీ లేగల్ని పెంచుకోకుండా అన్నిపాలూ మానవుల కిచ్చారే, ఆ పాలన్నీ యేమైనాయి? ఒక్కొక్క పాల చుక్కా మనశత్రువుల గొంతులు తడిపింది. ఓ కోడిపెట్టలూ! మీరు ఈ సంవత్సరంలో ఎన్ని గుడ్లు పెట్టారు? ఎన్ని గుడ్లను పొదిగి పిల్లల కింద తయారుచేశారు? ఎన్ని మన శత్రువులు రొట్టలేసుకుంటూ మింగేశారు! అటువంటి హంతకులను ఏంచేసినా పాపం లేదు!

“మనలో యే జంతువైనా సరే, పూర్ణాయుర్దాయం అనుభవించిందా? నామాట ఆలోచించకండి. ఏదో అదృష్టంవల్ల ఇంత కాలం బ్రతికి ఒక నాలుగువందల పిల్లల్ని కన్నాను. తక్కినవాటి మాట? మామూలుగా ముసలితనంరావడం, మృత్యువువాత పడడం, ఎప్పుడూ ఏజంతువూ ఎరుగదు. ఏ జంతువూ, దానంతటది చచ్చిపోదు. మానవులు చచ్చిపోనివ్వరు. కత్తికి గురిచేస్తారు. మానవులు చంపుతారు. పందిపిల్లలూ! ఎలా నిశ్చింతగా నిద్రపోతున్నారో! అన్నం పున్నెం ఎరుగవుకదా! ఒక్క సంవత్సరమే వాటి ఆయుస్సు. తర్వాత, మానవుల కడుపులవాత పడతాయి. ఒక్క పందు లేమిటి? సమస్తజంతువులూ కత్తికి ఎరౌతాయి—ఎప్పుడో ఒకప్పుడు!

“మనం గడుపుతూన్న దరిద్రపు జీవితాలకి కారణం, కారకు

లెవ్వరో అర్థమయిందనుకుంటాను. మనమంతా మానవుల నిరంకుశత్వానికి గురై పోతున్నాము. మానవుని జోలిలేకుండా చేసుకోండి! అప్పుడు మనం పడిన కష్టానికి సేకూరిన ఫలితం మనదే ఔతుంది. తెలుసుకున్నామంటే, క్షణంలో మనం భాగ్యవంతులమై స్వతంత్రులమై పోగలము. అయితే యేం చేయవలసివుంటుంది? రాత్రింబగళ్ళు నిద్రాహారాలు మాని, మానవజాతి పతనానికై పాటుపడాలి! నేస్తాలూ! అదే నా సందేశం! ఒక్కమాటలో చెప్పాలంటే—విప్లవం తీసుకురండి! ఆ శుభసమయం ఎప్పుడాసన్నమవుతుందో నాకు తెలియదు. ఒక వారంలో రావచ్చును; లేకపోతే ఒక శతాబ్దం పట్టవచ్చును. కాని ఒకటిమాత్రం నిశ్చయం: విప్లవం మాత్రం వచ్చి తీరుతుంది. నిరంకుశుడు అంతమొందితీరుతాడు. మనకి న్యాయం జరుగుతుంది. అందుచేత మీరందరూ విప్లవాన్ని ఆదర్శంగా పెట్టుకోండి. అదే జీవితపరమార్థంగా భావించండి. మీమీ సంతతికి ఈ సందేశాన్ని అందజేయండి. విజయం చేకూరేవరకూ అలా, తరతరాల పాటూ మన సంతతి పోరాటం సాగిస్తూనే వుంటుంది.

"తర్వాత: మీ పట్టుదల సడలకూడదు. ఎవరేమి చెప్పినా, విప్లవంనుండి మనస్సు మార్చుకోకూడదు. మానవులుగా, జంతువులుగా సమానభాగస్వాములనీ, ఒకరి సుఖమే రెండవవారి సుఖమనీ, మొదలైన తీపిమాటలూ, తర్కాలూ జరుగుతాయి. మానవుల మాటలు తేనెపూసిన కత్తులవంటివి. అందుచేత ఎప్పుడూ వారితో తర్కానికి దిగకండి. దిగినా, వారిమాటలువిని ఆదర్శాన్ని వీడకండి. ఇంకా మనమంతా ఆదర్శప్రాయమైన ఐకమత్యంతో మెలగాలి; ఈ స్వాతంత్ర్య సమరంలో అందరంకలిసి నడుములుబిగించి పనిచేయాలి. మానవులంతా మనకు పరమశత్రువులు. జంతువులన్నీ ఒక కుటుంబానికి చెందినవి."

ఆ సమయంలో, జంతువులలో పెద్ద అలజడికలిగింది. ముసలి పంది ఉపన్యాసం చాలించి "ఏమిటది?" అని ప్రశ్నించింది. అంతలో నాలుగు ఎలుకలు కలుగుల్లోంచి బైటకొచ్చి, వెనకాళ్లమీద

కూర్చుని అధ్యక్షుని ఉపన్యాసం వింటూండగా, వాటికేసి కుక్కలు కోపంగా చూశాయి. ఎలకలు భయపడిపోయి తిరిగి వాటి కలుగుల్లో దూరిపోయాయి. అలజడికి కారణం గ్రహించిన ముసలిపంది మళ్ళా మాట్లాడడం ప్రారంభించింది.

"నేస్తాలూ! ఒక ప్రశ్న నన్ను వేధించుకు తింటూంది. ఆ ప్రశ్న వేస్తాను. నా సంశయం తీర్చండి. అడవిజంతువులు - ఎలకలూ, కుందేళ్లూ మొదలైనవి - మన స్నేహితులా, లేక శత్రువులా? ఈ ప్రశ్నమీద సమాధానంగా ఓట్లు తీసుకుంటాను: మళ్లావినండి: ఎలకలు మన నేస్తాలా?"

ఎలకలు నేస్తాలన్నట్లు ఓట్లవల్ల నిర్ధారణైంది. నేస్తాలుకావన్నట్లు నాలుగుజంతువులు వ్యతిరేకంగా ఓట్లు వేశాయి. అవి - మూడు కుక్కలూ, పిల్లీ. కాని తర్వాత ఆ నాలుగూ కూడా అటూ ఇటూ ఓట్లు వేసినట్లు తేలింది.

మళ్లా ముసలిపంది ఉపన్యసించడం ప్రారంభించింది:

"నేస్తాలూ! ఇంక నేను చెప్పవలసింది ఆట్టే లేదు. మళ్లా హెచ్చరిస్తున్నాను: మానవునియెడల శత్రుత్వం వహించి ఉండవలసిన విధి మీది. ద్విపాదులు ఎవరైనాసరే, మనకి శత్రువులు. చతుష్పాదులూ, లేక రెక్కలున్నవి మన నేస్తాలు. మానవునిపై దాడిసలిపినప్పుడు మనంమాత్రం, అతని యుద్ధరీతిని అనుసరించకూడదు. మానవుల యుద్ధానికీ, మనయుద్ధానికీ పోలికే ఉండకూడదు. అతనిని జయించినతర్వాత అతని దౌర్బల్యాలను మనం అలవరచుకోకూడదు. ఏ జంతువూకూడా గృహంలో నివసించకూడదు; తల్పంమీద పరుండకూడదు. దుస్తులు వేసుకోకూడదు; మద్యపానం చేయకూడదు. పొగాకు ముట్టకూడదు; డబ్బు ముట్టకూడదు; మానవులతో వర్తకం చేయకూడదు. మానవుని ఆచార వ్యవహారాలన్నీ చెడుగుకి దారితీస్తాయి. అన్నిటికంటే, ఏ జంతువూ తన తోటిజంతువుమీద నిరంకుశత్వం వహించకూడదు. బలమైందవనీయండి, దుర్బలమైందవనీ

యండి, తెలివికలదవనీయండి, తెలివి లేనిదవనీయండి - మనమందరం సోదరులమే! సౌభ్రాతృత్వం అలవరచుకోండి. ఏ జంతువూ ఏ ఇతర జంతువునీ చంపకూడదు. సమస్తజంతువులూ సమానములు.

"ఇంక రాత్రి కన్న కలగురించి చెపుతాను వినండి. మానవు డంతరించిన తర్వాత ప్రపంచకం ఏరీతి నుంటుందో కలగన్నాను. చాలా కాలంక్రితమే మరచిపోయిన ఒక విషయాన్ని జ్ఞప్తికితెచ్చు కుందుకు, కన్న కల చాలా ఉపయోగపడింది. నా చిన్నతనంలో మా అమ్మ, తత్తిమ్మా పందులూ కలిసి, ఒక పాట పాడేవి. మొదటిమూడు చరణాలూ, రాగంతప్ప, వాళ్లకి కూడా ఆపాట సొంతంగా వచ్చేదికాదు. చిన్నప్పుడు, మా అమ్మావాళ్ళతోపాటు, నేనూ ఆ పాట పాడే దాన్ని. కాని వయస్సు మీరుతూన్నకొద్దీ ఆ వచ్చినంతపాటకూడా మరచిపోయాను. కాని, నిన్నరాత్రి హఠాత్తుగా ఆ కలతోపాటు ఆ పాటకూడా జ్ఞాపకానికొచ్చింది. మాటలు గుర్తుకొచ్చాయంటే నమ్మండి! కొన్ని తరాలక్రితం జంతువులకికూడా భాష ఉండేది. కాని ఈ జీవితపరిణామంలో మాటలు పోగొట్టుకొని మూగజీవాలమై పోయాము. ఆ పాట ఇప్పుడు పాడుతాను. ముసలితనంచేత నా గొంతు బాగుండక పోవచ్చును. ఐనాసరే, మీ కా రాగం నేర్పు తాను. అప్పుడు మీరంతా కలసి గొంతెత్తి శ్రావ్యంగా పాడుకోం డురుగాని. ఆ పాటపేరు మూగజీవాలు."

ముసలిపంది గొంతు సవరించుకుని పాడడం మొదలెట్టింది. బొంగురుగా, అంత శ్రావ్యంగా లేకపోయినా, ఆపాట జంతువులలో ఉత్తేజం కలిగించింది.

"ముల్లోకములలోని
మూగజీవములార!
మనిసిదాస్యము వీడి
ముందు నడువగ రండు
నేడో రేపో నరుడు
నాశనమ్మౌతాడు

నాడు నాడుల భూమి
మన వశమౌతాది!—
పడిన కష్టముతోడ
నిండు మన కడుపెల్ల
పాడిపంటల కొరత
వచ్చి నిల్వదు చెంత!
జీవకోటిలో లేవు
జాతిమతవర్గాలు
స్వేచ్ఛగా జీవించ
సమయ మరుదెంచె!—’

ముసలిపంది పాట పాడుతూండగానే సమావేశమైన జంతువులన్నీ వీరావేశంతో లేచి నిలబడ్డాయి. అధ్యక్షుడు పాడడం ఆపగానే, పశువులసావిడి కప్పు ఎగిరిపోయేలా, ఏకకంఠంతో జంతువులన్నీ పాటపాడడం మొదలెట్టాయి.

జంతువుల గానం విని, ముసలిరత్తయ్య నిద్రనుంచి ఉలిక్కిపడి లేచి, నక్కేమన్నా కోళ్ళని తినేందుకు లోపల దూరిందేమోనని కర్రపుచ్చుకు బైల్దేరాడు. రత్తయ్య వస్తూండడంచూసి, జంతువులన్నీ ఎవరి స్థానాల కవి పోయి నిద్రపోయాయి.



## ౨

సమావేశం జరిగిన మూడో నాటి రాత్రి ముసలిపంది చచ్చిపోయింది. మార్చిమాసం ప్రవేశించింది. అప్పటినుంచి సరాసరి, ఏకబిగిని మూడుమాసాలవరకూ రహస్యప్రచారం జరిగింది. ముసలిపంది ఉపన్యాసఫలితంగా ఎక్కువ తెలివిగల జంతువులు తమ జీవితాలను ఒక నూతనదృష్టితో చూడ్డం మొదలెట్టాయి. ముసలిపంది సూచించిన విప్లవం ఎప్పుడొస్తుందో వాటికి తెలియదు. వాటి జీవితకాలంలో అటువంటి శుభసమయ మాసన్నమౌతుందని ఆలోచించ లేకపోయినా విప్లవానికి దారితీయవలసినది, సిద్ధపరచవలసిన విధి తమదనిమాత్రం జంతువులు గ్రహించాయి. జంతువుల నన్నిటినీ కూడతీయడానికీ, అక్షరాస్యులుగా చేయడానికీ సహజంగా తెలివైన పందులు నియమింపబడ్డాయి. పందుల్లోకల్లా తెలివైనవి కన్నయ్యా, గునపమూ. కనయ్యా అట్టే మాటలకారి కాదు. తనపని తాను చేయించుకోగల సామర్థ్యం కలదనిమాత్రం ప్రతీతి. గునపము మాటలకారి. కొత్తకొత్త ఊహాలన్నీ తట్టే మనస్సు కలది. చిన్నతరహా పందుల్లో రాడీ అనేది ఒకటుంది. ఎక్కడా కాలునిలవదు. అతి చలాకీ ఐనది. రాడీని మాటలలో ఎవరూ ఓడించలేరు. నందిని పందిగానూ, పందిని నందిగానూ మార్చగల తెలివితేటలు గలది అది.

కన్నయ్యా, గునపం, రాడీ కలిసి ముసలిపంది సూక్తుల నన్నింటినీ క్రోడీకరించి ఒక సిద్ధాంతంగా తయారుచేసి, పశుతత్వమని పేరెట్టాయి. ఎన్నో రాత్రులు, ముసలిరత్తయ్య నిద్రపోగానే ఆ మూడుపందులూ, పశువుల సావిడిలో రహస్యంగా సమావేశాలు జరిపి, పశుతత్వాన్ని గురించి జంతువులకన్నిటికీ తెలియచెప్పాయి. మొదటిసారి సమావేశమైనప్పుడు కొన్ని జంతువులు, తెలివితక్కువగా, యజమానిపట్ల చూపవలసిన విశ్వాసం మొదలైనవాటిని గురించి మాట్లాడడం మొదలెట్టాయి.

"రత్తయ్య మనకి తిండి పెడుతున్నాడు. ఈ దివాణంనుంచి మన మతనిని తరిమివేస్తే, మన కింక తిండిపెట్టేవా రెవరు? అప్పుడు మనమంతా మలమల మాడి చచ్చిపోవలసిందేగా!" అంటూ కొన్ని జంతువులు విప్లవానికి విరుద్ధంగా మాట్లాడాయి. మరికొన్ని "మన తదనంతరం జరగబోయే విషయంగురించి మనమందరం, సుఖాన ఉన్న ప్రాణాలను దుఃఖమయం చేసుకోడంలో అర్థం లేదు. పైగా, ప్రస్తుతం అనుభవించనిదానికోసం ఎందుకు మన జీవితాలను త్యాగం చేయాలి?" అని ప్రశ్నించాయి. వాటికి సమాధానాలు చెప్పడంతోనే మూడుపందులకీ సరిపోయింది. పశుతత్వానికి, ఏ ఒక్క-జంతువూ, వ్యతిరేకంగా మాట్లాడకూడదనీ, పశుతత్వాన్ని సరిగ్గా అవగాహన చేసుకొన్ననాడు, ఎటువంటి సందేహాలూ మనస్సులో మొలకెత్తవనీ చెప్పి, పందులు, పశుతత్వాన్ని పునః విశదీకరించాయి. అన్ని జంతువులకంటె తెలివితక్కువగా ప్రవర్తించింది పంకజాక్షి.

"విప్లవానంతరం కూడా కలకండ ఉంటుందా?"

"ఉండదు. ఈ దివాణంలో కలకండ తయారీకి సావకాశం లేదు. పైగా, నీకు కలకండ అవసరం ఏమిటి? శుభ్రంగా కావలసినంత గోధుంపొట్టూ, పచ్చగడ్డీ తినవచ్చు"నని కన్నయ్య పంకజాక్షిని మందలించింది.

"పోనీ, ఈ ఎర్రరిబ్బనులు కట్టుకోవచ్చా?"

"నేస్తం! ఆ యెర్రరిబ్బనులు చూసుకుని ఎందుకలా మురిసిపోతున్నావో నా కర్థం కాకుండా ఉంది. ఆ రంగుపీలికలు దాస్య చిహ్నాలు. ఈ రిబ్బనులకంటే స్వేచ్ఛ ఎక్కువ ప్రాణప్రద మైందని నమ్మవా?" అని కన్నయ్య పంకజాక్షిని అడిగింది.

జమీందారుగారి దివాణంలో టర్కీకోడి ఒకటుంది. దానిపేరు తురాయి. తురాయంత అబద్ధాలకోరు మరో జంతువులేదు. పైగా రత్తయ్య దానిని అపురూపంగా పెంచుతూండడంచేత, అక్కడా ఇక్కడా విన్నమాటలన్నీ, మరినాలుగు కల్పించి, అతని చెవికి

మోయడం బాగా అలవాటు. ఎన్ని దుర్గుణాలున్నా, తురాయి చమత్కారంగా మాట్లాడగలదు. మాట్లాడడంలో చూపే చమత్కారం పనిచేయడంలో చూపక పోడంచేత జంతువులన్నిటికీ తురాయంటే చాలా కోపము.

కన్నయ్యా, గునపం, కాడీల అడుగుజాడల్లో మసలుతూ, పశుతత్వాన్ని సరిగ్గా అర్థంచేసుకున్నవి పంచకల్యాణి, జాకీలు. గుర్రాలు రెండూ కొంచెం మేధకులవడంచేత, చెప్పింది సరిగ్గా అర్థంచేసుకోలేకపోయేవి. ఐనాసరే నాయకులైన కన్నయ్యా, గునపం, కాడీలపట్ల అమితమైనవిశ్వాసం కలిగి వుండేవి. పశువుల సావిడిలో, ఏసమయంలో సమావేశం జరిగినాసరే ఇబ్బందని అనుకోక, గుర్రాలు హాజరై పశుతత్వప్రబోధగీతాన్ని పాడేందుకు తక్కిన జంతువులకి నాయకులుగా నిలబడేవి.

జంతువులలో అంత ఐకమత్యం వుందని ఎవ్వరూ అనుకోలేదు. తత్ఫలితంగా విప్లవం రూపంతాల్చ మొదలెట్టింది; తగిన సదవకాశాలు కూడా తటస్థపడ్డాయి. రత్తయ్యలో ముసలితనం ముసురుకోవడంచేత, మునుపటంత హెచ్చరికతో దివాణం వ్యవహారాలు చూసుకోలేకుండా వుండిపోతున్నాడు. పైగా త్రాగుడు హెచ్చిపోయింది. ప్రతిరోజూ, ప్రొద్దున్నా రాత్రీ తప్పక పశువులశాలకొచ్చి, జంతువులనన్నిటినీ చూసిపోతూండేవాడు వెనక. ఇప్పుడలా రావడం మానేశాడు. అతని వార్థక్యాన్ని - అండగా చేసుకుని, తక్కిన దివాణంనౌకర్లందరూ నడుంవంచి పనులు చక్కబెట్టడం మానుకున్నారు. పొలాలన్నీ బీళ్ళయిపోయాయి. పశువులశాలకప్పు కూలిపోవడం మొదలెట్టింది. పొలాల కట్టవాలన్నీ పడిపోవడంచేత, బైటిగొడ్లన్నీవచ్చి, పొలాలను ధ్వంసంచేసి పోతున్నాయి. దివాణం జంతువులన్నీ తిండిలేక మల మల మాడిపోడం సాగించాయి.

కుప్పలునూర్చే కాల మాసన్నమయింది. సంక్రాంతిపండుగ ముందే కుప్పలునూర్చే రత్తయ్య ఆమాటే మరచిపోయి పక్కనున్న కల్లుపాకలో కూర్చున్నాడు. పాలేరాళ్లు దూడలనువదిలి పాలు

పీతుక్కునిపోయారు. ఎవ్వరూకూడా గొడ్లకి నాలుగుగడ్డిపరకలైనా వేయలేదు. జంతువులన్నీ ఆకలితో హాహాకారాలు చేయసాగాయి. వాటికి వెర్రికోపం వచ్చింది. ఆగలేక రాటలకుకట్టిన తాళ్లను తెంచుకుని బైటపడ్డాయి. ఆవులన్నీ, ఒక్కటొక్కటే, బైటకొచ్చి నిలబడ్డాయి. ఆ సమయంలోనే తాగినమత్తులో రత్తయ్య నలుగురు పాలేరాళ్లని వెంటేసుకుని కొరడాలు ఝళిపిస్తూ పశువుల సావిడివైపు వచ్చాడు. అనుకోకుండా, అప్రయత్నంగా అన్ని జంతువులూ, ఒక్కసారి రత్తయ్యబృందం మీదికి విరుచుకుపడ్డాయి. వాళ్ళంతా అన్నివక్కలనుంచీ, జంతువులచేత కొమ్ములపోట్లూ, గిట్టలతన్నులూ తిన్నారు. ఏంచేయగలరు? జంతువులావిధంగా ప్రవర్తించడం ఎప్పుడూ వాళ్లు చూడలేదు. ఎప్పుడూ మానవులచేత చచ్చేలా జంతువులు దెబ్బలుతినడం ఉందిగాని, జంతువులచేత మానవులు దెబ్బలుతినడం ఆశ్చర్యంగాఉంది. ఆ తారుమారుకి తట్టుకోలేక రత్తయ్యా వాళ్ళూ కాళ్ళకి బుద్ధిచెప్పారు. గోచీలూడిపోతూ ప్రాణాలకోసం పరుగెడుతూన్న మనుష్యులూ, వారిని వెన్నంటి తరుముతూన్న జంతువులూ ! ఏ మాదృశ్యం !

ఆ దృశ్యాన్ని కిటికీగుండా చూస్తూన్న రత్తయ్యభార్య, చేతికి దొరికిన వస్తువుల్ని మూటకట్టుకుని, బైటికి పారిపోయింది. విజయోత్సాహంతో జంతువులన్నీ దివాణంలోకి పురోగమించి, రత్తయ్య ప్రభృతులు తిరిగిరావడానికి సావకాశంలేకుండా సింహాద్వారం బిడాయించాయి. అనుకోకండా, హఠాత్తుగా విప్లవం చెలరేగడం——విజయవంతమవడం——జంతువులకి అమితోత్సాహం, ఆనందంకలిగింది. మానవుణ్ణి తొలగించారు ; దివాణం, జంతువుల కాణాచైంది.

వెర్రిఆనందం కలగడంచేతా, హఠాత్తుగా దివాణమంతా వాటిదైపోవడంచేతా, అంతభాగ్యంతో ఏంచేయాలో, జంతువులకి తెలిసింది కాదు. ఓం ప్రథమంగా కలిగిన విజయసూచనగా, జంతువులన్నీ——పెద్దవీ చిన్నవీ——కలిసి, దివాణంచుట్టూ పరుగెత్తుతూ గెంతడం మొదలెట్టాయి. మానవు డెక్కడైనా ఇంకా నక్కిఉన్నాడేమో అనే

అనుమానంతో, అవి మూల మూలలా వెతికాయి. తర్వాత, రత్తయ్య నిరంకుశత్వ పరిపాలనాచిహ్నాల నన్నిటినీ నాశనం చేసేందుకని, భవనంలోకి పరుగెత్తాయి. ముక్కుతాళ్లు, పలుపులూ, కుక్కల గొలుసులూ, కత్తులూ—అన్నిటినీ—నూతిపాలు చేశాయి. మండుతూన్న మంటలో కొరడాలూ, రంగు రంగుల రిబ్బనుపీలికలూ, పరశురామప్రీతి అయాయి.

"నేస్తాలూ! రిబ్బనులు మానవచిహ్నమైన దుస్తులే. వాటిని మనం విసర్జించాము. జంతువులన్నీ నగ్నంగానే ఉండాలి" అని కన్నయ్య అంది.

కన్నయ్యమాటలు విన్న పంచకల్యాణి, వేసవిలో నెత్తికి పెట్టుకునే గడ్డిటోపీ తీసుకొచ్చి, మంటలో పడేసింది. రత్తయ్యని జ్ఞాపకంతెచ్చే ఏ చిన్నవస్తువునుకూడా ఉంచకుండా తగలపెట్టేశాయి

గునపం, జంతువులన్నింటినీ ధాన్యంపాతర గదులవేపు తీసికెళ్లి, కడుపునిండా తిండిపెట్టింది. తర్వాత, అన్నీ కలిసి 'మూగజీవాలు' ప్రబోధగీతం ఒక ఏడుసార్లు పాడాయి. తర్వాతసుఖంగా ఎవరికి తోచిన చోట, అవి స్వేచ్ఛగా, హాయిగా నిద్రించాయి.

యథాప్రకారంగా జంతువులన్నీ, తెల్లవారుఝామున లేచాయి. సంపాదించుకొన్న స్వాతంత్ర్యంమాట జ్ఞప్తికి రాగానే, అవన్నీ, స్వేచ్ఛావాయువులను పీల్చుకుంటూ, ఛంగ్ ఛంగ్మని పొలాలమ్మట గెంత నారంభించాయి. పొలాల కోమూలగా ఒక చిన్న కొండవుంది. ఆ కొండమీదికెక్కి జంతువులన్నీ స్వంతమైపోయిన దివాణాన్ని చూసుకుని మురిసిపోయాయి. చూపుకి ఆనినంతమట్టుకూ వాళ్ళదే! ఆనందం పట్టలేక, నేలమీదపడి, మంచులో పొర్లాయి. ఛాతీలు విరుచుకుని ఎంతోసేపు, దివాణంలో పచార్లుచేశాయి.

జంతువులన్నీ తిరిగి భవనంవైపు వెళ్లాయి. కాని, లోపల ప్రవేశించడానికి జంకాయి. కన్నయ్య, గునపం ముందుకొచ్చి మూతులతో తలుపుతోయగానే తక్కినవన్నీ వరుసగా, ఒకదానివెనకాతల

ఒకటి నడుచుకుంటూ లోపల ప్రవేశించాయి. జమీందారుగారు అనుభవిస్తూన్న వస్తువుల నన్నిటినీ ఆశ్చర్యంతో చూశాయిగాని, ముట్టుకోలేదు. మేడదిగి వస్తూండగా, పంకజాక్షి మాయమైంది. వెంటనే జంతువులన్నీ తిరిగి వెనక్కి నడిచి పంకజాక్షిని వెతకడం ప్రారంభించాయి. హంసతూలికాతల్పాలతో అమర్చబడిన జమీందారు గారి పడక గదిలో అద్దానికెదురుగా, రిబ్బనుపట్టుకుని పంకజాక్షి నిలబడిఉంది. రిబ్బనులకోసం వెర్రివ్యామోహం పడుతూన్న పంకజాక్షిని ఖండలించి జంతువులన్నీ బైటకొచ్చేశాయి. జమీందారుగారి భవనాన్ని వస్తుప్రదర్శనశాలగా వుంచేందుకు తీర్మానించాయి. ఏజంతువూ కూడా ఆభవనంలో నివసించకూడదని ఒప్పందం చేసుకున్నాయి.

భవనం ఇవతల సమావేశమైన జంతువులతో కన్నయ్యా గునపా లిలాఅన్నాయి:

"నేస్తాలూ! తెల్లారి ఆట్టే పొద్దెక్కలేదు. ఈవేళమనం కుప్పలునూర్చడం ప్రారంభించాలి. అన్నట్లు, అన్నింటికన్నా ముఖ్యమైన విషయం మరొకటుంది," అని పందులు చదవడం, వ్రాయడం గురించి చర్చ సాగించాయి. రత్తయ్య పిల్లలతాలూకు ఓ నమూల పుస్తకం ఒకటి పెంటకుప్పమీద పడిఉంటే, అది తీసుకుని, కన్నయ్యా, గునపం, మూడుమాసాలపట్టి చదవడం, వ్రాయడం సాధనచేశాయి. పలుపురంగు, తెలుపురంగుగల కుండలను కుక్కలను తెమ్మని, కన్నయ్య దివాణం సింహద్వారంవైపు నడిచింది. వ్రాయడం బాగా నేర్చుకొన్న గునపం, ముందరికాళ్ళు రెంటితోనూ వాటంగా కుంచె పట్టుకుని 'పశువుల దివాణం' అని పెద్దపెద్ద అక్షరాలలో ఒకబోర్డు వ్రాసి దివాణం సింహద్వారానికి తగిలించింది. కన్నయ్యా, గునపం తిరిగి ధాన్యంపాతరగదులవేపు నడిచాయి. మూడుమాసాల విద్యాకృషిఫలితంగా పశుతత్వసిద్ధాంతాన్ని సప్తవిధులక్రింద క్రోడీకరించగలిగాయి. పశువుల దివాణంలో నివసించే జంతువులన్నీ శాస్త్రబద్ధంగా పశుతత్వాన్ని అనుసరించి జీవితాలను గడిపేందుకూ, ఎల్లవేళలా సప్తవిధులనూ ఆచరణలో పెట్టవలసినట్లు హెచ్చరికగా

ఉండేందుకూ, ఆసప్తవిధులనూ గోడమీద వ్రాయడానికి పందులు నిశ్చయించాయి. కష్టంమీద గునపం నిచ్చెనెక్కి నిలబడింది. అందు బాటులో రాడీ రంగుకుండ పట్టుకు నిలబడింది. ఒక ముప్పైగజాల దూరాన్నుంచైనాసరే, తడుముకోకుండా చదివేటంత పెద్ద అక్షరాల్లో సప్తవిధులూ వ్రాయడమైంది.

స ప్త వి ధు లు.

1. ద్విపాదప్రాణి ఏదైనా సరే పరమశత్రువు.
2. చతుష్పాదప్రాణి లేక, పక్షులుగల దేదైనాసరే మిత్రుడు.
3. ఏ జంతువూ దుస్తులు ధరించకూడదు.
4. ఏ జంతువూ పక్కమీద పరుండకూడదు.
5. ఏ జంతువూ మద్యపానము చేయకూడదు.
6. ఏ జంతువూ ఏ జంతువునైననూ చంపకూడదు.
7. అన్నిజంతువులూ సమానము.

తక్కిన జంతువుల కర్థమయేందుకు గునపం గట్టిగా చదివింది. అన్నిజంతువులూ నచ్చినట్లు తలలూపాయి. వాటిలో, అతితెలివిగలవి మాత్రం సప్తవిధులనూ కంఠస్థంచేసుకోడం మొదలెట్టాయి. కుంచె కింద పారేస్తూ గునపం—"నేస్తాలూ! పొలంలోకి నడవండి. రత్తయ్యా, పాలేరాళ్ళకంటే, అచిరకాలంలోనే, మనమంతా కలిసి, కుప్పలు నూర్చేయాలి." అని అంది. ఆ సమయంలో, పాలన్నీ పొదుగుల్లో పేరుకుపోయి బాధకలిగించడంచేత మూడావులు 'అంబా' అంటూ కాదామరెత్తినట్లు అరిచాయి. సాధనంకోసం ఆలోచించి చివరకు పందులు,బిందెలు తెచ్చి, ముందరికాళ్ళతో పాలుపితికేశాయి.

"అన్నిపాలూ యేంచేస్తారు ?" అని రొట్టలేసుకుంటూ కొన్ని జంతువు లడిగాయి.

"పాలగురించి మీరేమీ ఆలోచించ నవసరంలేదు. ముఖ్యమైంది కుప్పలునూర్చడం. గునపం దారిచూపుతుంది. మీరంతా

పొలంలోకి నడుస్తూండండి. నేను వెనకాతలే వచ్చి కలుసుకుంటాను. ఊఁ! నడవండి మరి!" అని కన్నయ్య జంతువులను పొలాలకి తోలింది.

జంతువులన్నీ సాయంత్రం తిరిగి వచ్చేటప్పటికి పాలు మాయమవడం గ్రహించాయి.



# 3

జంతువు లెంతకష్టపడి కుప్పలు నూర్చాయని! పడిన కష్టానికి ఫలితంగా, అనుకున్నదానికంటె, ఎంతో ఎక్కువఫలం చేకూరింది!

పొలంపనిచేయడం కష్టంగానే ఉండేది. మనుష్యులకోసమై తయారైన పరికరాలు, జంతువుల ఉపయోగానికి పనికొచ్చేవి కావు. పోనీ, ఆ పరికరాలనే, ఎలాగో అలాగ వాడుదామంటే, వెనక కాళ్ళ మీద నిలబడి, ముందరికాళ్ళతో జంతువులు వాటిని పట్టుకు ఉపయోగించవలసివచ్చేది. కాని జంతువులకి వెనకకాళ్ళమీద నిలబడ్డం మహాయాతనగా వుండేది. అటువంటికష్టాల నెన్నిటినో తెలివిగా, పందులు ఈదుకుంటూవచ్చి, పనికి అంతరాయం కలగకుండామాత్రం చూస్తూండేవి. ఎద్దులకి పొలాలభోగట్టా అంతా పూర్తిగా తెలుసును. నిజానికి కుప్పలు నూర్చడంలో పందులేమంత సహాయం చేయలేక పోయేవి. తతిమ్మా జంతువులకన్నా తెలివైన వవడంచేత, పందులు వాటికి పనులు పురమాయిస్తూ సక్రమంగా అవి పనులు చేస్తున్నదీ, లేందీ పైనుండి చూసేవి. పందులే నాయకత్వం వహించాయి. చివరకు బాతులూ, కోడిపెట్టలూకూడా, ప్రొద్దున్నించి సాయంత్రం వరకూ ఒక్కొక్క గడ్డిపరకే ముక్కుల్ని కరుచుకు, ఒకచోట గడ్డి పోగుచేయడంలో సహాయపడేవి. జంతువులన్నీ, రత్తయ్యావాళ్ళకంటే రెండుదినాలు తక్కువకాలంలోనే, కుప్పలునూర్చడం పూర్తిచేశాయి.

గడియారం మోస్తరుగా, జంతువులన్నీ వళ్ళుదాచుకోకుండా, వేసవికాలమంతా కష్టపడి పనిచేశాయి. వాటంతటవే కష్టపడి పండించుకున్న ఆహారం అవడంచేతా, వేరే ఎవరో ఒక యజమాని తూచితూచి ఆహారం పెట్టవలసిన అగత్యం లేకపోవడంచేతా, ఎంతో

ఆనందంతో, సంతృప్తితో ఆహారంతినేవి. ఇతరుల కాయకష్టంమీద ఆధారపడి ఇతరులను పీడించి పిప్పిచేసే మానవుల బారినుండి తప్పించుకోవడంచేత, ప్రతిజంతువుకీ కడుపునిండా కావలసినంత ఆహారం సమకూరింది ; ఎక్కువ విశ్రాంతికూడా ఉండేది. కాని సంవత్సరాంతానికి జంతువులు కొన్నికష్టాలను ఎదుర్కోవలసి వచ్చింది. కుప్పలు నూర్చేందుకు పాతపద్ధతే అవలంభించవలసి వచ్చింది. కుప్పలను బాగా తొక్కి కంకుల్లోంచి గింజల్ని నేలమీద రాల్చాయి. తుక్కునుంచి గింజల్ని విడదీయడం ఎల్లా ?—చేటలుపట్టి, మానవులలా చెరగలేవే ? యంత్రాలుంటే బాగుండు ననుకున్నాయి. చెరగడానికి బదులు, ఒక ఉపాయం ఆలోచించి, జంతువులన్నీ కుప్పదగ్గరగాపోయి, గట్టిగా ఊది, తుక్కు నెగరగొట్టి, ధాన్యాన్ని వేరుపరిచాయి. పొలం పనిలోమట్టుకు ఎద్దులు ఎప్పుడూ ముందుకేవచ్చి అంతపనీ వాటి నెత్తిమీదే పెట్టుకునేవి. అంతకష్టపడి పనిచేసినా ఇంకా పొలంలో పనులు అలానే వుండేవి. అందుకని, బాగా చీకటివుండగానే లేచిపోయి, పొలానికి పోయేందుకు కోళ్ళని, కొంచెం త్వరగానే కూసి లేవమనేవి. ఏపనిచెప్పినా, కష్టమని ననగక 'ఇంకా ఎక్కువగా కష్టపడతాము' అని ఎద్దులు చిరునవ్వుతో నేస్తాలకి సమాధానమిచ్చేవి.

ప్రతిజంతువూ దాని శక్తికొద్దీ అది 'చంద్రునికో నూలుపోగు' గన్నట్లు పొలంపాటులో సాయపడేవి. చివరకు కోడిపెట్టలూ బాతులూ కూడా అక్కడక్కడ చెదిరి రాలిపడినగింజలను ఏరి, ఒక ఐదుకుంచాల వరకూ పోగుచేశాయి. కడుపు కక్కుర్తితో ఏజంతువూ ఒక్క గింజైనా దొంగిలించేదికాదు. 'నేను పడిన కష్టానికింతేనాతిండి' అని ఏజంతువూ ననిగేదికాదు. ఈర్ష్యా, కొట్లాటలూ, మొదలైన పూర్వపు ప్రవర్తన పూర్తిగా నశించిపోయింది. ఏజంతువూ దొంగెత్తు వేసి, పనిచేయకుండా ఒళ్ళు దాచుకునేదికాదు.

వంకజాతికి పెందలాడే లేవడం అలవాటులేదు. జమీందారుగారి పెంపకంలో దానికిబద్ధకం బాగా బలిసిపోయింది. పనిచేసేటప్పుడు కూడా, అందరికంటె ముందుగానే డెక్కలో రాయి ఇరుక్కుందనే

సాకుతో పంకజాక్షి పనిచేయకుండా లేచిపోయేది. ఇంక పిల్లిప్రవర్తన అదోరకంగా ఉండేది. ఏదేనా చేయవలసిన పనిఉందని తెలియగానే కనిపించకుండా పారిపోతూవచ్చేది. ఒక్కొక్కప్పుడు గంటలకొలదీ కనిపించక, సరిగ్గా తిండితినేవేళకి అందరితోపాటు హాజరయేది; లేక పోతే, పనిఅంతా పూర్తిఅయాక సాయంత్రంపూట, ఏమీ ఎరగనట్లు అది తిరిగి దివాణం చేరుకునేది. పనిచేసేవేళ తాను అక్కడలేకపోయి నందుకు నమ్మించేలా సాకులుచెప్పి, ఎంతో జాలిగా 'మ్యావ్' మనేది. రత్తయ్య వుండేటప్పుడు, ఎట్లా విసుగులేకుండా రోజంతా పనిచేసేదో, అట్లాగే ముసలిగాడిద తనపని తాను చేసుకుపోయేది. విప్లవాన్నిగురించికాని, దాని ఫలితంగురించి కాని అదెప్పుడూ ఎటువంటి అభిప్రాయమూ వెలిబుచ్చేదికాదు. రత్తయ్యని తరిమివేసిన తర్వాత, తాను సుఖంగా ఉన్నదీ లేనిదీ అడిగితే "గాడిదలు చాలా కాలం బ్రతుకుతాయి. మీలో ఎవరైనాసరే, చచ్చినగాడిదెను చూశారా?" అని అడిగేది.

జంతువులన్నిటికీ ఆదివారాలాటవిడుపు. ఆ రోజు వుదయం రోజూకంటె ఒక ఘంట ఆలస్యంగా అవి తిండితినేవి. తర్వాత అన్ని జంతువులూ సమావేశమై పశువుల దివాణం చిహ్నమైన పతాకాన్ని ఉత్సవంతో ఎగురవేసేవి. రత్తయ్యభార్య తాలూకు పాత ఆకుపచ్చ చీరముక్క ఒకటితీసి, దానిమీద కన్నయ్య, ఒక కొమ్ముచిత్రం, ఒక డెక్కచిత్రం గీసింది. అదే పశుస్వామికపతాక. ఆ బావుటా అర్థంగురించి కన్నయ్య జంతువులకి బోధించేది.

"నేస్తాలూ! పచ్చరంగు పైరులను సూచిస్తుంది. డెక్కా, కొమ్మూ—మానవజాతి పూర్తిగా అంతమొందినతర్వాత భావి కాలంలో ప్రవర్థమానంగా స్థాపితమయే పశుస్వామిక చిహ్నలు."

పతాకోత్సవం జరిగిన తర్వాత ఖాళీగాఉన్న ధాన్యంపాతరవద్ద, జంతువులన్నీ సమావేశమయాయి. ఆ సమావేశమే సాధారణ సమావేశము. వచ్చేవారంలో, ఏ ఏ జంతువు ఏ ఏ పనులు చేయవలసినదీ ఒక ప్రణాళిక తయారుచేసి, దానిమీద తీర్మానాలుజరిపి, జంతుసభికుల

ఎదుట అంగీకారానికి పెట్టడమయ్యేది. పందులే ఎప్పుడూ తీర్మానాలను జంతుసభికులముందర పెట్టేవి. తీర్మానాలపై వోటువేయడంతప్ప తీర్మానా లెట్లా తయారుచేయాలో జంతువులకు తెలియదు. ఇంక సమావేశాలలో జరిగేచర్చల్లో కన్నయ్యా, గునపం ఎంతో ఉత్సాహంగా, తెలివిగా పాల్గొనేవి. ఆ సభల్లో జరిగే చర్చల సారాంశమేమంటే—కన్నయ్యా, గునపం ఎప్పుడూ ఏవిషయంపైనా ఏకాభిప్రాయులై ఉండేవికావు. కన్నయ్య చెప్పిందానికి గునపం అడ్డు చెప్పేది. గునపం చెప్పిందానికి కన్నయ్య అడ్డుపడేది. ఒకసారి, వృద్ధాప్యంవచ్చి పింఛను పుచ్చుకున్న జంతువులు నివసించే నిమిత్తం జామ తోట వెనకాతలనున్న స్థలం కేటాయిస్తే బాగుంటుందన్న విష యంపై చర్చజరిగింది. ఆ స్థలనిర్ణయానికి ఎవ్వరూ అడ్డుచెప్పకూడదని అన్నీ నిశ్చయించాయి కాని, ఎంత వయస్సుతాగానే పింఛను పుచ్చు కోవాలీ అనే విషయంపై పెద్ద వాదం జరిగింది.

ధాన్యపుకొట్టు కార్యాలయంగా చేసుకుని పందులు అందు లోనే నివసించాయి. జమీందారుగారి - పుస్తకభాండాగారంనుంచి, పుస్తకాలు తెచ్చుకుని, సాయంత్రంపూట కమ్మరిపని, వడ్రంగం— ఇంకా తదితరమైన పనులనుగురించి దీర్ఘంగా పందులు చదివాయి. పశుసంఘాలు ఏర్పరచడంలో కన్నయ్య, విసుగూ విరామంలేకుండా తిరిగేది. కోడిపెట్టలకొరకు 'అండోత్పత్తిసంఘం', ఆవులకి 'పరిశుద్ధ వాలసంఘము', 'అడవిజంతు విద్యాప్రబోధసంఘము' (ఎలుకలనూ, కుందేళ్ళనూ మచ్చికచేసుకునే నిమిత్తం) గొర్రెలకు "అతి తెలుపు ఊలు ఉద్యమం" — ఇలాగ ఎన్నో సంఘాలను కన్నయ్య ఏర్పరచ డమే కాకుండా, చదువనూ వ్రాయనూ నేర్పేందుకు పాఠశాలలను కూడా స్థాపించింది. కాని పడిన శ్రమంతా బూడిదలోపోసిన పన్నీ రైంది. ఎలుకలనూ, కుందేళ్లనూ మచ్చిక చేద్దామనే ప్రయత్నం విఫలమైంది. ఎంత ప్రేమతో, వాత్సల్యంతో వాటిని చేరదీస్తే, అంత దూరంగా పారిపోయాయి. విద్యాప్రబోధసంఘంలో పిల్లిజేరి, కొన్ని దినాలవరకూ చాలా హుషారుగా పనిచేసింది. ఒక రోజున గొడ్లశాల

కప్పుమీద కూర్చుని, దూరంగా వ్రాలిన పిచికలతో మాట్లాడడం ప్రారంభించింది.

"నేస్తాలూ, సమస్త జంతువులూ సమానం; పూర్వం మనందర్నీ విడదీసి, నిరంకుశంగా పరిపాలించిన మానవనియంతల అంతంచేశాము. మనహృదయాలు, ఇప్పుడు చాలా చేరువగా రావాలి. కావలిస్తే, మీరొచ్చి నా వీపుమీద వ్రాలవచ్చు. నా పాదంమీద కూర్చోవచ్చును. మునుపటి పిల్లిని కాను నే నిప్పుడు!"

కాని ఒక్క పిచికకూడా పిల్లివైపు రాలేదు. చదవడం, వ్రాయడం నేర్పేందుకు పెట్టిన పాఠశాలలు మాత్రం అద్భుతమైన ఫలితాలు చూపాయి. పశువుల దివాణంలోని ప్రతిజంతువూ కొద్దో గొప్పో, చదవడం వ్రాయడం నేర్చుకుంది.

పందులు మాత్రం చదవడం, వ్రాయడం నేర్చేసుకున్నాయి. కుక్కలు చదవడం మట్టుకు అలవాటు చేసుకున్నాయిగాని, సప్త విధులూ చదవడంలో చూపే ఉత్సాహం మరొకటి చదవడానికి చూపేవికావు. పందుల మాస్టరుగానే ముసలి వెంకన్న తుణ్ణంగా చదివేదికాని, చదువవలసినంత మంచి విజ్ఞానం ఏమీ లేదని, చదవకుండా వుండేది. జాకీ అక్షరాలన్నీ నేర్చుకుందిగాని, రెండక్షరాల మాటైనా పలుకలేకపోయేది. పంచకల్యాణికి 'అ, ఆ, ఇ, ఈ' లు వచ్చాయికాని, మిగతా అక్షరాలు ఎంత నేర్చుకుందామన్నా వచ్చాయికావు. పంచకల్యాణి డెక్కతో నేలమీద అ, ఆ, ఇ, ఈ లు వ్రాసి, అక్షరాలకేసి తేరిపారిచూస్తూ, ఏ అక్షరం తర్వాత యే అక్షరమో తెలియక, ఆలోచించేది. చాలాసార్లు, ఉ, ఊ, ఋ, ౠ లు నేర్చుకొందికాని, మొదటి నాలుగు అక్షరాలూ వెంటనే మర్చి పోయేది. చివరకు ప్రాణం విసిగి, మొదటినాల్గు అక్షరాలతోనే సంతృప్తిచెంది, మర్చిపోకుండా, ప్రతిరోజూమాత్రం నేలమీదవ్రాసి దిద్దుకొనేది. పంకజాక్షి, తన పేరు వ్రాయడం మాత్రమే నేర్చుకుంది. అందంగా పేరువ్రాసి, ఇన్ని పువ్వులు తెచ్చి, అక్షరాలచుట్టూ అమర్చి మురిసిపోయేది. ఒక్క, 'అ' అనే అక్షరం మాత్రం నేర్చుకుని,

తక్కిన జంతువులు చదువు చాలించాయి. బొత్తిగా మెదడులేని మేకలూ, గొర్రెలూ, కోడిపెట్టలూ, బాతులూ, సప్తవిధులనుకూడా కంఠతా పట్టలేక పోయాయి. జంతువుల మేధకత్వంచూసి, ఆలోచించి కన్నయ్య సప్తవిధులనూ ఒక సూక్తిలోకి ఇమిడ్చింది. "చతుష్పాదులు మంచివి. ద్విపాదులు చెడ్డవి" అని. ద్విపాదుల జాతికి పక్షులుకూడా చెందడంచేత, అవి కన్నయ్యతో దెబ్బలాడాయి.

"నేస్తాలూ! పొరపడకండి! పక్షిపక్షము ఎగిరేందుకు ఒక సాధనము. అందుచేత రెక్కలుకూడా పాదాలంత అవసరమైనవే. అందుచేత మీరు ద్విపాదులైన మానవజాతికి చెందరు. పైగా మానవ చిహ్నమైన హస్తాలు మీకు లేవుగా. ఆ హస్తాలతోటి, మానవుడు ఘోరమైన పనులు చేస్తున్నాడు" అని కన్నయ్య నచ్చచెప్పగానే, పక్షులన్నీ సంతృప్తిచెందాయి. జంతువులన్నీ కొత్తసూక్తిని కంఠస్థం చేయ మొదలెట్టాయి. సప్తవిధులనూ వ్రాసిన గోడమీదే కొంచెం పెద్దఅక్షరాలతో క్రోడీకరించి తయారుచేసిన క్రొత్తసూక్తిని-వ్రాయడమైంది. కంఠతా రాగానే మేకలూ, గొర్రెలూ ఏదికాని వేళలకూడా "చతుష్పాదులు మంచివి. ద్విపాదులు చెడ్డవి" అని ఒకటే స్థాయిలో గంటలతరబడి అరిచేవి.

కన్నయ్య యేర్పరచిన సంఘాలగురించి గునపం ఎంతమాత్రం ఇష్టం చూపించలేదు. వయోజనవిద్య లాభంలేదని ప్రాథమికవిద్య చాలా ముఖ్యమైందనీ గునపం అభిప్రాయపడింది. కుప్పలు నూర్చడం అవగానే కుక్కలు రెండూకలిసి ఒక తొమ్మిది పిల్లలను పెట్టాయి. పుట్టిన కుక్కపిల్లల విద్యగురించి తాను బాధ్యత వహిస్తానంటూ గునపం వాటిని తీసుకుపోయింది. ఎవరికీ కనిపించకుండా ఉండేచోట వాటిని దాచిపెట్టి, గునపం చదువు చెప్పడం ప్రారంభించింది. పశువుల దివాణంలోని జంతువులు పూర్తిగా ఆ కుక్కపిల్లలు బ్రతికి వున్నట్లు కూడా మరిచిపోయాయి.

గేదెలూ, ఆవులూ ఇస్తూన్న పాలు మాయమవడంలోని రహస్యం చివరకు బైటపడింది. పందులు త్రాగే అంబలిలో, ఆ పాలన్నీ

కలపడం, తక్కిన జంతువులు పసిపట్టాయి. గాలిదుమారాలవల్ల చెట్ల నుండి పళ్లూ, కాయలూ రాలేవి. అన్నిటికీ సమానంగా రాలుగాయ లన్నీ పంచిపెట్టడం జరుగుతుందని జంతువులనుకుంటే, అలా కాక ఒక్కపందులే తినవలసిందనీ, కాయలన్నిటినీ యేరి కార్యాలయం లోనికి చేరవేయవలసిందనీ ఆజ్ఞ ఐంది. అన్యాయం జరుగుతూందని తెలిసికూడా జంతువులు లాభంలేదని, కిమ్మనకుండా ఊరుకున్నాయి. తక్కిన జంతువులను సమాధానపరచేందుకుగాను పందులు రాడీని పంపించాయి.

"నేస్తాలూ! మేమేదో స్వార్థంతో, స్వాపేక్షతో ఆ కాయ లన్నీ తింటున్నా మనుకునేరు. మాలో చాలామందికి పాలన్నా, ఫలాలన్నా రోత. నా మట్టుకు నాకు ఇష్టంలేదు. ఐతే పాలూ, ఫలాలూ మేమే ఎందుకు పుచ్చుకుంటున్నామంటే ఆరోగ్యం కాపాడు తుందుకు. మా ఆరోగ్యమే కాపాడుకోవడంలో ఒక పరమార్థముంది. అదేమిటంటే, ఈ పశువుల దివాణం నడపడానికి మెదడు ఉపయో గించి అహోరాత్రులు పనిచేసే బాధ్యత మా నెత్తిన పడింది. అందు చేత పాలుత్రాగినా, పళ్లుతిన్నా, మరే ఇతరపని చేసినా, మీ క్షేమం కొరకే, ఈ దివాణం కాపాడే నిమిత్తం కృషి సలిపేందుకే. మేమేపనీ చేయలేకపోతే, మళ్ళా రత్తయ్య దివాణాన్ని ఆక్రమించుకుంటాడు. రత్తయ్య తిరిగిరావడం మీలో ఎవరికీ ఇష్టంలేదని నమ్ముతాను. రత్తయ్య తిరిగి రావడం మీ కిష్టమా? చెప్పండి!"

ఏ అన్యాయం జరిగినా సరే భరిస్తాయికాని, రత్తయ్య తిరిగి రావడం, ఏ జంతువూ కోరదు. అందుచేతనే, రాడీ బెదిరింపు మాటలునమ్మి, పాలలోనూ పండ్లలోనూ వాటాలు కోరడం జంతు వులు మానుకొన్నాయి.



# ౮

రిహితాపురం జమీందారుగారి దివాణం పశువుల వశమైనట్లూ, దివాణంలో పశుస్వామికం స్థాపించినట్లూ, నలుమూలలా తెలిసింది. పశుతత్వ సిద్ధాంతాన్ని చుట్టుపక్కలఉన్న జంతువులలో ప్రచారం సాగించేందుకూ, మూగజీవాల ప్రబోధగీతం నేర్పేందుకూ, పావురాల గుంపులను కన్నయ్యా, గునపాలు పంపించారు.

దివాణంలో జంతువు లావిధంగా సుఖంగా జీవిస్తూండగా, రత్తయ్య తన గ్రామంచేరుకుని, తానుపెంచి పెద్దచేసిన దివాణం జంతువులన్నీ తనని తన్ని తరిమేసి ఎటువంటి అన్యాయం చేసిందీ ప్రతి వారికీచెప్పి, "ఇది పశువుల యుగం. మానవులంతా స్పర్థలు మానుకుని ఏకమై పశుస్వామికాన్ని మూలనాశనం చేస్తేనేగాని లాభం లేదు. లేకపోతే మానవులకి పతనం, నాశనం సంభవిస్తుంది" అని గోడు పెట్టేవాడు. పశువుల దివాణం ఇరుగుపొరుగునే మరొక రెండు దివాణాలున్నాయి. ఆ రెండు దివాణాలవారూ ఎప్పుడూ కాట్లకుక్కల్లా దెబ్బలాడుకోడంకద్దు. క్రొత్తగా ఏర్పడ్డ పశుస్వామికాన్ని చూసి ఎప్పుడు తమ దివాణంలోని జంతువులుకూడా తిరగబడి తమని కూడా తరిమివేస్తాయో అని వారంతా భయపడ్డారు. పశువుల దివాణానికి అప్రతిష్ఠ తెచ్చేందుకుగాను మానవులతో అసహ్యంగా దుష్ప్రచారం చేయసాగారు. కాని, వారెంత దుష్ప్రచారం చేసినా కన్నయ్యా గునపాలు పంపిన పావురాల గుంపులు మాత్రం వాటి ప్రచారంతో చుట్టుపక్కలఉన్న జంతువుల్లో స్వాతంత్ర్య పిపాస రెచ్చగొట్టాయి. విప్లవాని కన్నిటినీ తయారుచేశాయి చెప్పినట్లువిని మెడలకు కాడి తగిలించుకు విశ్రాంతి లేకుండా పొలాలుదున్నే ఎద్దులు, రైతుమాట వినడం మానేశాయి. మేకలు కంచెలుదాటి, వేసిన నారు తినేశాయి. పాలిస్తూ ఇస్తూ ఫెడేలుమని ఆవులూ, గేదలూ పాలేళ్ళ మూతులు విరిగేలా తన్నేవి. చివరకు చుట్టుప్రక్కలవున్న జంతువు

లక్ష్మి 'మూగజీవాలు' ప్రబోధగీతం రోజస్తమానం పాడుతూ, బానిసలుతీరి పొలాలమ్మట నడిచేవి. ఆ పాట వింటూన్న మానవులు భయంతో కోపంతో తల్లడిల్లిపోయి, వెర్రికోపంతో కొరడాలు పుచ్చుకుని జంతువుల ఒళ్ళు చీల్చేసేవారు. ఎన్ని బాధలు పెట్టినాసరే జంతువులు ఆ పాట పాడడం మాత్రం మానేవి కావు.

ఒకనాడు పశువుల దివాణంలో జంతువులన్నీ వాటివాటి పనులలో మునిగివుండగా ప్రచారంకోసం బైటికిపోయిన పావురాలు తిరిగివచ్చి రత్తయ్యా, పొరుగునున్న దివాణాల మనుష్యులూకలిసి, తుపాకులూ, కత్తులూ, కర్రలూ పట్టుకు సింహద్వారం బ్రద్దలుకొట్టి లోపల ప్రవేశించినట్లు వార్త చెప్పాయి. అనుకున్నదంతా జరిగింది. రత్తయ్యతోటీ, తతిమ్మా మానవులతోటీ యుద్ధం చేయడం ఎలాగూ తప్పదని తెలిసే, జంతువులన్నీ వాటివాటి జాగ్రత్తలో అవి ముందునుంచీ ఉంటూనే ఉన్నాయి. జమీందారుగారి పుస్తకభాండాగారంలో ఉన్న పద్మవ్యూహ యుద్ధపద్ధతి క్షుణ్ణంగా చదివిన గునపం, దివాణం రక్షణకోరకు ప్రయత్నాలు జరిపింది. ఏఏ జంతువు ఎక్కడెక్కడ నిలబడి ఏ ఏ విధంగా యుద్ధం చేయాలో చెప్పింది.

మానవులు దివాణం భవనం చేరుతూండగా కన్నయ్య మొట్టమొదటగా యెదుర్కొంది. ఒక ముప్పైఐదు పావురాలు ఆకాశదాడి సల్పాయి. పావురాలదాడికి తట్టుకోలేక మానవులు ఆకాశంవైపు చూస్తూంటే కంచెలో దాక్కున్న బాతులు గొరిల్లాయుద్ధం—అంటే, ఒక్కసారి బైటికొచ్చి మానవుల పిక్కలుపట్టుకు ముక్కులతో, కండలూడేలా పీకడం, మళ్ళీ పారిపోవడం—సాగించాయి. కాని మానవులు మొదట కొంచెం కంగారుపడినా, తర్వాత తర్వాత ధైర్యం తెచ్చుకుని, బాతులను కర్రలతో కొట్టి తరిమివేశారు. ముసలి వెంకన్నా, గేదెలూ, ఆవులూ, మేకలూ, గొర్రెలూ కన్నయ్య నాయకత్వంకింద వాటికి తోచినట్లుని ఒక్కసారిగా ముందుకు కొమ్ములతో కుమ్ముతూ, వెనకకాళ్ళతో తన్నుతూ, దద్దుర్లుపడేలా తోకలతో కొడుతూ మానవుల మీదకి ఉరికాయి. అంత పెద్ద జంతుదాడిని

కూడా సహించి మానవులు తిరోగమించక పురోగమించడం ప్రారంభించారు. వేసిన పన్నాగం ఫలించకపోవడంచూసి, కన్నయ్యా ఒక్క కేక పెట్టింది. ఆ కేక సంజ్ఞగా గ్రహించి, జంతువులన్నీ తోకలు ముడిచి దివాణంలోపలికి పరుగెత్తాయి.

పారిపోతున్నట్లు నటిస్తూన్న జంతువుల వెనకాతల జయజయ ధ్వానాలుచేస్తూ మానవులు అడ్డదిడ్డంగా పరుగెత్తారు. కన్నయ్యా పాచిక పారింది. అనుకున్నట్లుగా మానవదళాన్ని చీల్చింది. గొడ్లు సాగిస్తున్న దొడ్లోకి వాళ్లనురానిచ్చి మూడు గుర్రాలు, మూడు ఆవులూ, మిగిలిన పందులూ, మానవుల వెనకాతల పడ్డాయి. దాడి సల్పమని సంజ్ఞచేసి, కన్నయ్యా రత్తయ్యమీద కురికింది. రత్తయ్య తప్పించుకొని గురిచూసి తుపాకీ కన్నయ్యమీద పేల్చాడు. కన్నయ్య వీపు, దూసుకుపోయిన తుపాకీగుండు దూరంగా నిలబడివున్న గొర్రెకు తగలగానే, అది చచ్చి నేలపడింది. గాయాన్ని లెక్కచేయక కన్నయ్యా రత్తయ్యా కాళ్లమధ్య దూరగానే, రత్తయ్యా గుభాలున పక్కనేఉన్న పేడకుప్పలో పడ్డాడు. చేతిలోని తుపాకీ దూరంగా పడిపోయింది. అన్నిటికన్నా చిత్రమైన యుద్ధం పంచకల్యాణి సల్పింది. వెనకాళ్ళు రెండింటితోనూ ఫెడేలుమని ఓ మనిషిని తన్నింది. దాంతో, ఆ మనిషి మంచినీళ్ళడగకుండా నేలకూలాడు. ఆ దృశ్యం చూసి తక్కిన వాళ్లంతా, హడలెత్తిపోయి, చేతనున్న కర్రలువిడిచి కాళ్లకు బుద్ధి చెప్పారు. మానవులలో కలవరం బయలుదేరింది. ఎవరు మట్టుకు వారు ప్రాణరక్షణకోసం దివాణంచుట్టూ దారి వెతుక్కుంటూ పరుగెత్తారు. వారిని తరుముతూ జంతువులు వెన్నంటాయి. మానవునిమీద తనకున్న అక్కసు ఎలాగో అలాగ ప్రతిజంతువూ తీసుకుంది. చివరకు పిల్లికూడా ఒక మనిషి జబ్బమీదకి దూకి వాడి గోళ్లతో పీకినొక్కింది. మానవులు తిరోగమిస్తుంటే బాతులు 'లేవిడీ' కొట్టి, వారి పిక్కలు పొడవడం మొదలుపెట్టాయి.

మానవులందరూ పారిపోయారుకాని పంచకల్యాణిచేత తాపు తిని నేలకూలిన మానవుడు మాత్రం తిరిగి లేవలేదు. కాళ్లతోకుదిపి

పంచకల్యాణి అతనిని లేపబోయింది. కాని ఎలా పడ్డవాడు అలానే పడి ఉండిపోయాడు.

"పాపం అతను చచ్చిపోయాడు. అంత పని జరుగుతుందని నేననుకోలేదు. పైగా డెక్కలకి లాడాలున్నా యన్నమాటే మర్చిపో యాను. చంపాలని చంపలేదని అంటే మట్టుకు, ఎవరు నమ్ముతారు?" అని పంచకల్యాణి, మానవుని గురించి చాలా విచారించింది.

"జాలిపడకూడదు నేస్తం! యుద్ధంలోనూ ప్రేమలోను ఏది చేసినా ధర్మబద్ధమే! చచ్చిన మానవుడే మంచివాడు?" అంటూ వెన్నునుంచి రక్తంకారుతూన్న కన్నయ్య, పంచకల్యాణిని ఓదార్చింది.

"ఎన్ని చెప్పు నేస్తం! నిండు ప్రాణం తీయడం నా కిష్టంలేదు. అందులోనూ మానవుని ప్రాణం తీయడం" అని పంచకల్యాణి కంట నీ రెట్టుకుంది.

"పంకజాక్షి యే"దని ఒక ఆవడిగింది.

పంకజాక్షి కనిపించలేదు. మానవు లెవరైనా పంకజాక్షిని గాయపరచారో లేక, దొంగిలించారో అని అన్ని జంతువులూ కంగారుపడి నలుమూలలా వెతికాయి. గడ్డితొట్టెలో ముఖం దాచు కుని పంకజాక్షి పడుకునివుంది. తుపాకీ శబ్దంవిని అది హడులెత్తి పారి పోయింది. తిరిగి జంతువులన్నీ వెనక్కివచ్చి నేలమీద ఒరిగిన మాన వునికోసంచూస్తే, వాడు అక్కడలేడు. తెలివి రావడంతోటే లేచి, ఆ మానవుడు పలాయన మంత్రం పఠించాడు.

జంతువులన్నీ సమావేశమై ఏఏ జంతువు ఏఏ విధంగా యుద్ధం చేసిందో, ఒక దానిని మించిన స్థాయిలో మరొకటి చెప్పడం మొద లెట్టింది. పతాకోత్సవం జరిపి మూగజీవాలు ప్రబోధగీతం పాడాయి. యుద్ధంలో తుపాకీగుండుకి ఎరైన గొర్రెను వీరోచితమైన గౌర వంతో పాతిపెట్టాయి. గొర్రె సమాధి యెదుట నిలచి కన్నయ్య —

"నేస్తాలూ! గొర్రె మన పశువుల దివాణంకోసం ప్రాణా లర్పించింది. ఎటువంటి దేశభక్తి! ఎటువంటి త్యాగం! మీరంతా

కూడా గౌరి మాదిరిగా, వీరత్వంతో ప్రాణాలకు లెక్కచేయక పశువుల దివాణంకోసం, పశుస్వామికంకోసం సర్వకాల సర్వావస్థల యందూ అప్రమత్తులై ఉండాలి" అని ఉపన్యసించి గౌరి ఆత్మశాంతికి ఒక్క నిమిషం అర్ధనిమీలిత నేత్రాలతో నిలబడింది.

వీరోచితమైన ఒక పతకాన్ని తయారుచేసి వీరులను దానితో అలంకరించాలని జంతువులన్నీ, ఏకగ్రీవంగా తీర్మానించాయి. 'పశువీరుడు—మొదటి తరగతి—అనే బిరుదుతో కన్నయ్యనీ, పంచకల్యాణినీ గౌరవించాయి. గుర్రాల కళ్ళగంతలు ఇత్తడివి—దివాణంలో వున్నాయి. ఆ ఇత్తడి చిప్పలు తెచ్చి, పతకాలుగా, కన్నయ్యకీ పంచకళ్యాణీలకి జంతువులు సమర్పించాయి. 'పశువీరుడు-రెండవ తరగతి—'అనే బిరుదుతో చచ్చిన గౌరిను గౌరవించాయి.

ఇంక, జరిగిన యుద్ధానికి, ఏమి పేరు పెట్టాలి అనే విషయంపై చర్చ జరిగింది. ఆవులసావిడిదగ్గర జరిగింది కనుక — గోశాల యుద్ధం—అని పేరెట్టాయి. రత్తయ్య వదలివేసిన తుపాకీని పశువుల దివాణం జండాస్తంభం మొదలులో అమర్చాయి. గోశాలయుద్ధ వార్షికోత్సవంనాడు, విజయసూచకంగా ఆ తుపాకీ పేల్చేందుకు నిశ్చయమైంది.

శీతాకాలం వస్తూన్నకొద్దీ పంకజాక్షి గొడవ ఎక్కువైపోయింది. ప్రతిరోజూ ప్రొద్దుటిపూట పనిలోకి ఆలస్యంగావచ్చి మెలకువ రాలేదనీ వళ్లంతా వచ్చిపుండనీ సాకులు చెప్పేది. మూలుగులు మునపట్లాగ, భోజనా లెప్పట్లాగ అన్నట్లు పంకజాక్షి మాత్రం తిండి, నుష్టుగాతినేది. ఒకవేళ పనిలోకి వచ్చినా, ఏ కొద్దిసేపో పనిచేస్తూన్నట్లు నటించి, ఏదో సాకుచెప్పి చెంతనేఉన్న చెరువుదగ్గరికి పరుగెత్తి, నీళ్ళలో తన ప్రతిబింబం చూసుకుంటూ, గంటలతరబడి నిలబడేది. పంకజాక్షి గురించి చెప్పలేనన్ని పుకారుల చెలరేగాయి. ఒక రోజున్న, ఎందుకో పట్టలేనంత ఆనందంతో తోక యెత్తి, దొడ్డిలో పంకజాక్షి గెంతుతూండడంచూసి జాకీ—

"పంకజాక్షీ! ఇలా రా! నిన్నొ సంగతి అడగాలని

అనుకుంటున్నాను. ఈ వేళ ప్రొద్దున్న కంచెచాటునుంచి, అబ్బాయి నాయుడిగారి తోటలోకి ఎందుకు తొంగిచూస్తున్నావు? నాయుడి గారి పాలేరాడు, అక్కడ నిలబడి నీ వేపుచూసి నవ్వుతున్నాడా, లేదా? నీతో మాట్లాడుతూ నీ మూతి నిమురుతున్నాడుకదూ? ఇదంతా ఏమిటి పంకజాక్షి?" అని అడిగింది.

"అత నలా చేయలేందే! నే నసలక్కడ లేనే లేను. అంతా అబద్ధం!" అంటూ పంకజాక్షి, బావురుమని ఏడ్చింది.

"పంకజాక్షీ! నా ముఖంలోకి చూడు! నిజంచెప్పు. అతను నీమూతి దువ్వాడా? లేదా?"

"ఊహుం! లేదు!" అని జాకీముఖంలోకి చూడ్డానికి భయపడి, పంకజాక్షి పారిపోయింది.

జాకీ, పంకజాక్షి గురించి ఎవరితోనూ చెప్పక, తిన్నగా పంక జాక్షిసాలలోకి వెళ్లి గడ్డితొట్టి తన్ని తడిమింది. కలకండా, రంగు రంగుల రిబ్బనులూ కనిపించాయి.

జాకీకీ పంకజాక్షికీ సంఘర్షణ జరిగిన మూడోనాడు పంకజాక్షి మాయమైంది. కొన్ని వారాలవరకూ దానినిగురించి ఏటువంటి వైనమూ తెలియలేదు. దరిమిలాను అబ్బాయినాయుడుగారి దివా ణంలో, పంకజాక్షిని చూసినట్లు పావురాలు చెప్పాయి. అప్పటినించీ జంతువులు, పంకజాక్షి గురించి తలవడంకూడా మానేశాయి

వర్షం లేకపోవడంచేత భూమంతా, కొయ్యబారినట్లు బిగిసి పోయింది. పొలాలు దున్నాలి, గింజలు చల్లాలి, మళ్ళా ఎప్పట్లాగే పంటలు పండించుకోవాలి. ముందు ఎదుర్కోవలసిన క్లిష్టసమస్యల న్నిటినీ ఆలోచించేందుకు జంతువులన్నీ సమావేశమయ్యాయి. పందులు, ప్రణాళికలు తయారుచేశాయి; సాధనాలగురించి, తీవ్రాలో చనలు జరిగాయి. పశువుల దివాణం పరిపాలనాక్రమం నిర్ణయించ వలసిన బాధ్యత పందుల దనే తీర్మానంమీద వోటు తీసుకోడం జరిగింది. జంతువులన్నీ సమ్మతించాయి. కాని, అప్పుడప్పుడు కన్నయ్యా గునపాలుమాత్రం, ఏచిన్నవిషయంగురించీకూడా, భేదాభిప్రాయాలతో

పకాభిప్రాయాని కొచ్చేవికావు. అందుమూలంగా జంతువులలో రెండు పక్షాలేర్పడ్డాయి. కన్నయ్యాపక్షమనీ, గునపం పక్షమనీ. సమావేశాలలో, వాక్చాతుర్యంతో, కన్నయ్య జంతువులన్నిటినీ తన పక్షానికి చేర్చుకోకలిగేది. కాని గునపం మంచి ప్రచారంచేసి, జంతువులను తనవైపు లాక్కొనేది. గొర్రెలూ, మేకలూ ఎప్పుడూ గునపం పక్షాన్నే ఉండేవి. గునపానికే ఓట్లు వేసేవి. సమావేశం జరుగుతూంటే, మధ్యగా లేచి "చతుష్పాదులు మంచివి. ద్విపాదులు చెడ్డవి" అని పనికాని వేళలకూడా కేకలువేసి అవి సమావేశంలో రసాభాసం కల్గిస్తుండేవి. ముఖ్యంగా కన్నయ్య మాట్లాడుతూంటే, మరింత గట్టిగా అరిచేవి.

జమీందారుగారి పుస్తకభాండాగారంలోకి వెళ్ళి, పశువుల దివాణం, ఏవిధంగా అధునాతనంగా చేయవచ్చునో అనే విషయంపై కన్నయ్య ఎన్నో పుస్తకాలు చదివేది. దివాణంలో సైడుకాల్వల నిర్మాణంగురించీ ఇంకా ఇతర సాధనాలగురించీ అది ఆలోచిస్తుండేది. గునపం ఏపనీ చేయకుండా, కన్నయ్య చెప్పబోయేదానికీ చేసేదానికీ అడ్డు తగులుదామని, ఎప్పుడూ సమయంకోసం ఎదురుచూస్తూండేది. అన్నింటికన్నా, గాలిమర నిర్మించడంగురించి, కన్నయ్యా గునపం తీవ్రంగా దెబ్బలాడుకున్నాయి.

దివాణంభవనాలకి దూరంగా పొలంలో ఒక యెత్తైన గుట్ట వుంది. ఆ ప్రదేశం అంతా పరిశీలించి, అక్కడ ఆ గుట్టమీద గాలిమర నిర్మిస్తే చాలా బాగుంటుందని కన్నయ్య నిశ్చయానికొచ్చింది. ఆగాలి మర సహాయంవల్ల విద్యుచ్ఛక్తియంత్రం ఒకటి నిర్మించి, దివాణానికి విద్యుచ్ఛక్తి సరఫరా చేయవచ్చునని కూడా ఊహించింది. విద్యుచ్ఛక్తి సహాయంతో, అన్నిపనులూ సులువుగా శీఘ్రకాలంలో చేయడానికి సావకాశం కలుగుతుందనీ, జంతువులు ఎక్కువ కష్టపడనవసరం వుండదనీ, పెద్ద ప్రణాళిక తయారుచేసి, అమర్చబోయే యంత్రాలబొమ్మలు గీసి జంతువులకి బోధపరచగానే, అవన్నీ చాలా సంతోషించాయి. గునపంమాత్రం ద్వేషభావంతో ప్రవర్తించింది. ఒకనాడు సుద్దతో నేలమీద గీసిన యంత్రాల బొమ్మలు చూసే మిషతో, గునపం

లోపలకొచ్చి కాస్సేపు కోరగా చూసి, ఆ బొమ్మలమీద మలా మూత్రాదులు విసర్జించి పారిపోయింది.

అప్పటినుంచీ, పశువులన్నీ గాలిమరగురించి భేదాభిప్రాయాలతో వైషమ్యాలు పెంచుకోడం మొదలెట్టాయి. గాలిమరకట్టడం, అనుకున్నంత సులభంకాదనీ, గోడలు కట్టేందుకు బోలెడంత కారురాయి తవ్వి, బద్దలుకొట్టి తేవలసివుంటుందనీ తర్వాత విద్యుచ్ఛక్తి కోసం, విద్యుచ్ఛక్తియంత్రం నిర్మించాలనీ, విద్యుచ్ఛక్తి దివాణంలోకి తీసుకుపోవడానికి, తీగెలు కావాలనీ— మొదలైన వెన్నో చేయవలసిన పనులు చెప్పి, కన్నయ్య జంతువులసహాయం కోరింది.

"నేస్తాలూ! గాలిమరనిర్మాణంలో మనమంతా ఒళ్లువిరుచుకుని పనిచేయాలి. గాలిమరతోపాటు, విద్యుచ్ఛక్తియంత్రంకూడా అమర్చామంటే, ఇకనుంచి వారమంతా, మనం పనిచేయ నవసరం వుండదు. వారానికి మూడుదినాలే పనిచేయవలసివుంటుంది. తక్కిన దినాలన్నీ విశ్రాంతే!"

కన్నయ్య మాటలు విన్న గునపం—

"నేస్తాలూ! మీ కడుపులకి రాళ్లూ, విద్యుచ్ఛక్తీ కావాలా, లేక తిండి కావాలా? ప్రస్తుత పరిస్థితులలో యంత్రనిర్మాణం గురించి ఆలోచించడం అప్రస్తుతం. ఇప్పుడు మనకి కావలసింది ఆహారం! ఎక్కువ ఆహారం పండించాలి. లేకపోతే ఈ సంవత్సరం అందరం, ఆకలిమంటలతో మలమలమాడిపోతాము" అని కన్నయ్య తలపెట్టిన ప్రణాళికకు ఎదురువాదన చేసింది.

జంతువులన్నీ, రెండుతెగలకింద యేర్పడి, "ఓటెవరికోయ్!" "కన్నయ్యకోయ్! వారాని కెన్నిదినాలు పనిచేయాలోయ్?" మూడుదినాలోయ్!" అంటూ కన్నయ్యపక్షం జంతువులూ, "ఓటెవరికోయ్?" "గునపానికోయ్!" రాళ్లుకావాలా? తిండికావాలా!" అని గునపం పక్షం జంతువులూ ఒక్కసారిగా రణగొణ ధ్వనిచేశాయి. ముసలి వెంకన్నమాత్రం ఏపక్షంలోనూ జేరకుండా ఊరుకుంది.

గాలిమర గురించిన దెబ్బలాటలు ఎట్లాఉన్నా, పశువుల దివాణరక్షణ, ఒకసమస్య ఐంది. గోశాలయుద్ధంలో, మానవులను ఓడించినా-

ఎప్పుడో ఒకప్పుడు, బలం చేకూర్చుకుని, మళ్లా మానవులంతా, పశువుల దివాణంమీద విరుచుకు పడతారన్న విషయం జంతువులన్నీ గ్రహించాయి. పైగా 'గోశాలయుద్ధం' తక్కిన జానిసజంతువులలో ఒక నూతనోత్సాహాన్ని కల్గించింది. మానవులు, జంతువుల వింత ప్రవర్తనచూసి, హడిలిపోయి ఎలాగైనా పశుస్వామికాన్ని, మూలనాశనం చేయాలని కృతనిశ్చయులైయున్నారు. అటువంటి సమయంలో కూడా పశువుల దివాణరక్షణవిషయమై కన్నయ్యా గునపాలు భేదాభిప్రాయం కల్గివున్నాయి. తుపాకులూ, మందుగుండుసామగ్రి సంపాదించి వాటివాడుకలో పశువులు తర్ఫీదు పొందాలంటుంది గునపము. వందలకొద్దీ పావురాల గుంపులను బైటికి పంపి, తక్కిన దివాణాలలోని జంతువులమధ్య ప్రచారం సాగించి పెద్ద విప్లవం తేవాలంటుంది కన్నయ్య. మానవులనుండి దివాణాన్ని రక్షించుకోలేకపోతే, పశుస్వామికం మానవాక్రాంతం ఐపోతుందని గునపం అంటే, తదితర ప్రాంతాలలో విప్లవం చెలరేగిననాడు, దివాణరక్షణ ఎంతమాత్రం అవసరం వుండదని కన్నయ్యావిశ్వాసము. కన్నయ్యా గునపాల తర్కవితర్కాలువిని జంతువులు, ఏఒక్క నిశ్చయానికీ రాలేకపోయాయి. ఆ నిమిషానికి ఏది ఎలా మాట్లాడితే దానితో అవి ఏకీభవించడం మొదలెట్టాయి.

గాలిమర నిర్మాణం గురించి కన్నయ్యా ప్రణాళిక తయారు చేయడం పూర్తైంది. ఆప్రణాళికమీద, రాబోయేసమావేశంలో వోటు తీసుకోవలసివుంది. జంతువులన్నీ సమావేశం అవగానే, కన్నయ్యా నిలబడి, గాలిమరనిర్మించడంలోని ఆవశ్యకత గురించి సభ్యులకి నివేదించింది. తర్వాత గునపం సమాధానంచెప్పేందుకు నిలబడింది.

"నేస్తాలూ! గాలిమర కట్టడంగురించి ఆలోచించడమే వృథా! అటువంటి పిచ్చితుగ్లక్ పనికి మీరెవ్వరూ ఒప్పుకోకూడదు!"

"నేస్తాలూ, మనలో మనం ఈవిధంగా భేదాభిప్రాయాలు కల్గి ఉండడం ఏమంత బాగులేదు. మీరంతా, నాప్రణాళిక నామోదించి, ముందు ముందు సుఖపడతారని నమ్ముతాను!" అని, కన్నయ్యా

ఉద్రిక్తంగా ఉపన్యసించింది. కన్నయ్య ఉపన్యాసం, జంతువుల మనస్సులను కదిలించింది. జంతువులన్నీ కన్నయ్యపక్షం తిరిగిపోయాయని చూసి, గునపం లేచి నిలబడి అసహ్యంతో, కోపంతో, ఒక్క కేక పెట్టింది. ఆ కేక వినగానే తొమ్మిది పెద్దకుక్కలు అక్కడికి పరుగెత్తుకుంటూ వచ్చి కన్నయ్యమీదకి, నోళ్లు తెరుచుకుని ఉరికాయి. వాటి కందకుండా కన్నయ్య పారిపోయింది. దాని వెనకాతల తొమ్మిది కుక్కలూ పరుగెత్తాయి. జంతువుల సమావేశములో అలజడి కల్గింది. కన్నయ్య పొలాలమ్మటపడి, రోడ్డువైపుకి పరుగెత్త ప్రారంభించింది. ఒక కుక్కనోటికి కన్నయ్య తోక అందుబాటులోకి వచ్చింది; కాని కన్నయ్య మంచి సమయస్ఫూర్తితో, తప్పించుకుని కంచెదాటి, కనిపించకుండా పారిపోయింది.

ఆ దృశ్యాన్ని చూచి, జంతువులన్నీ హడలెత్తిపోయి, కిమ్మనకుండా, ధాన్యంకొట్టులోకి వెళ్ళిపోయాయి. అన్ని కుక్కలు ఎక్కణ్ణించి వచ్చిపడ్డాయా అని జంతువులన్నీ విస్తుపోయి, తర్వాత, కుక్కలు పెట్టిన పిల్లలను ఎత్తుకుపోయి గునపం పెంచి పెద్దచేసిన సంగతి జ్ఞప్తికి తెచ్చుకున్నాయి. గునపమంటే కుక్కలకి పంచప్రాణాం.

కుక్కలను వెంటేసుకుని తిన్నెమీద గునపం నిలబడి :

"నేస్తాలూ! కాలయాపనం వృథా. కాబట్టి నేటినుంచి ఆదివారం ఉదయంపూట సమావేశాలుండవు. దివాణం పరిపాలనాక్రమం, ముందు ముందు నా అధ్యక్షతక్రింద ఏర్పరచబోయే ప్రత్యేక పందుల సంఘం చూస్తుంది. ఈ సంఘం ఏకాంతంగా సమావేశమై, విషయాలను చర్చించి చేయవలసిన పనులగురించి మీకు తెలియచేస్తుంది. ఐనప్పటికీ, మనపతాకానికి వందనాలర్పించి 'మృగజీవాలు' ప్రబోధ గీతం పాడేందుకూ, ఎవరెవరు ఏఏ పనులు చేయవలసిందీ తెలుసుకునేందుకూ మాత్రం ఎప్పట్లాగే ఆదివారం ఉదయాలు, జంతువులన్నీ సమావేశమౌతాయి. సమావేశాలలో ఎటువంటి విషయంగురించీ చర్చలు జరగవు" అని గునపం ఉపన్యసించింది.

కన్నయ్య బహిష్కరణతో హడలెత్తిపోయిన జంతువులూ

గునపం ఉపన్యాసధోరణితో మరింత విస్తుపోయాయి. తర్కించడం చేత కాదు కాని, లేకపోతే చాలా జంతువులు గునపాన్ని ఎదుర్కొని ఉండేవి. పంచకల్యాణికూడా, గునపాన్ని అర్థంచేసుకోలేక పిచ్చి చూపులు చూసింది.

నాలుగు చిన్నపందులు లేచి నిలబడి గునపానికి వ్యతిరేకంగా గట్టిగా అరవడం మొదలెట్టాయి. గునపంచుట్టూ కూర్చున్న కుక్కలు కోపంగా గుర్రుపెట్టగానే పందులు హడలిపోయి నోరు మూసుకున్నాయి. అంతలోకే మేకలూ, గొర్రెలూ కలిసి "చతుష్పాదులు మంచివి, ద్విపాదులు చెడ్డవి" అని ఒకపది పదిహేను నిముషాల పాటు పొలికేకలెట్టాయి.

గునపం ఉపన్యాస సారాంశం అన్ని జంతువులకీ తెలిసేలా చెప్పేందుకునాను, రౌడీని పురమాయించడమైంది.

"నేస్తాలూ! దివాణం రక్షణభారమంతా తన నెత్తిమీద వేసుకున్న గునపం త్యాగాన్ని అందరూ శ్లాఘిస్తారని తలుస్తాను. నాయకత్వంవహించడం చాలా సులభమైందని అనుకోకండి. నాయకుడు వహించవలసిన బాధ్యత ఎంతోవుంది. జంతువులన్నీ సమానమన్న సూత్రంలో, గునపానికున్నంత విశ్వాసం మరేజంతువుకీ లేదు. దివాణం పరిపాలనాక్రమం మీరే దిద్దుకుంటామంటే నేస్తం గునపం ఎంతమాత్రం అడ్డురాదు, అడ్డుచెప్పదు. కాని మీరంతా సరియైన ప్రణాళిక తయారుచేసి, సక్రమంగా పరిపాలన గావించలేరు. అప్పుడు మన గతి ఏంకాను? అందుకే కార్యభారాన్నంతా పైనవేసుకుని, జీవితాన్ని పశువుల దివాణంకోసం, మనం స్థాపించిన పశుస్వామికం కోసం గునపం త్యాగం చేస్తుంది. అందుచేత మనమంతా గునపానికి జోహారు లర్పించాలి. కన్నయ్య పిచ్చితుగ్లక్! సాధ్యంగాని వెర్రి మొర్రికలలు—గాలిమరగురించీ, విద్యుచ్ఛక్తి గురించీ—కంటూంది. కలలు కార్యరూపం తాల్చలేవు. వాస్తవిక జగత్తులోవుండి పనిచేసి సుఖపడాలి. కన్నయ్య, ఆ వెర్రికలలతో మిమ్మల్ని మోసగించబో

యింది. అది నేరస్థురాలు. శిక్షార్హురాలు" అని ఉద్రిక్తంగా రాజే ఉపన్యాసిస్తూంటే :—

"ఆ గోశాల యుద్ధంలో మనం నెగ్గడానికి కన్నయ్యా సాహస ధైర్యాలే కారణాలు" అని ఒక జంతువు అరిచింది.

"ధైర్యంవుంటే చాలదు. విశ్వాసం, విధేయతా కావాలి. 'గోశాలయుద్ధం' లో కన్నయ్యా గొప్ప ధైర్యసాహసాలు చూపించిందంటున్నారు. కొంచెం ఓపికపట్టండి. అసలు సంగతి మీకే తెలుస్తుంది. కాయిదా కావాలినేస్తాలు! కాయిదా కావాలి! నాయకుడు చెప్పినట్లు చేయాలి, వినాలి. ఈ రోజుల్లో నాయకునిచే పైమాటగా ఉండాలి. అప్పుడే, మనం కష్టపడి సంపాదించుకున్న పరస్వామికం నిలబడుతుంది. నాయకుని అడుగుమడుగులు దాటి ఒక్కఅడుగు బైటవేశామా, మనకి పతన మాసన్నమైందన్న మాటే! శత్రువులకి మనం లోకువైపోతాము. అప్పుడు వారు మనమీద విరుచుకుపడతారు. ఒక్కటే అడుగుతా : రత్తయ్యని మళ్ళా ఈ క్షివాణంలోకి, మీకు రానియ్యాలనిఉందా ?"

జంతువులన్నీ ఏ సమాధానం చెప్పకుండా ఊరుకున్నాయి. ఎందుకంటే, వ్యక్తిస్వాతంత్ర్యం పోగొట్టుకొని ఎటువంటి ఇబ్బందులైనా పడిఉండగలవు కాని, రత్తయ్యా పునరాగమనం మాత్రం కోరలేవు, కోరవు.

"ఆదివారాల ఉదయపు తర్కవితర్కాల ఫలితంగా రత్తయ్యా తిరిగివస్తేమట్టుకు, మాకు ఆ సమావేశాలూ, ఆ తర్కవితర్కాలలో పాల్గొనేందుకు స్వేచ్ఛ అవసరంలేదు. నేస్తం గునపం ఆదివారాల సమావేశాలు అనవసరమంటే, మేమూ అనవసరమే అంటాము" అని జంతువుల తరఫున పంచకల్యాణి సమాధానంచెప్పింది. "గునపం యెప్పుడూ న్యాయమేచెప్తుంది" అనే దృఢనమ్మకాన్ని పెంచుకుంది పంచకల్యాణి.

నేల కొంచెం మెత్తబారింది. అరకలుకట్టి పొలాలు దున్నడం

ప్రారంభమైంది. ప్రతి ఆదివారం ఉదయం పదిగంటలకు జంతువులన్నీ సమావేశమై, వచ్చేవారం ఏది ఏపని చేయాలో తెలుసుకునేవి. కాని, పూర్వం లా జంతువులన్నీ కలిసి కూర్చోడం మానేశాయి.

రాడీతోటీ, పద్యాలూ, పాటలూ బాగా వ్రాసే మరో పంది - కూనీతోటీ, చుట్టూ తొమ్మిది కుక్కలూ అర్ధచంద్రాకారంలో కూర్చుని కాపలా కాస్తూ ఉంటే, ఛాతీ విరుచుకుని, తీనెమీద ఆసనం కూర్చునేది. తక్కిన పందులన్నీ వెనకగా కూర్చునేవి. తక్కిన జంతువులన్నీ ఎదురుగా సమావేశమవగానే వచ్చేవారపు పనులు తెలియ పరచి, గునపం, 'మూగజీవాలు' ప్రబోధగీతం మొదటి చరణం పాడ గానే, తక్కిన జంతువులు నిలబడి ఏకకంఠంతో ఆ పాట పాడేవి.

నిజానికి, గునపానికి గాలిమర నిర్మాణంఅంటే చాలా ఇష్టమనీ, కన్నయ్య చూపించిన ప్రణాళికా, నేలమీద గీసిన బొమ్మలూ - అన్నీ - గునపం తయారుచేసినవే అనీ, తన పేరు ప్రఖ్యాతులకోసం కన్నయ్య, వాటి నన్నింటినీ దొంగిలించి స్వంతంచేసుకుందనీ రాడీ జంతువులలో ప్రచారం సాగించింది.

"అలాగైతే, గాలిమర నిర్మాణానికి, గునపం ఎందు కంత అయిష్టత చూపించింది?" అని ఒకజంతు వడిగింది.

"అక్కడే గునపం టక్కరితనం కనిపిస్తుంది. కన్నయ్యనెలా ఐనా ఈ దివాణంనుండి తరిమివేద్దామనే ఉద్దేశంతో అలా దానికెదు రుగా నిలబడి, హోరాహోరీ పోట్లాడింది. కన్నయ్య మనలో ఉండ తగ్గది కాదు. మనజాతికి చీడపురుగువంటిది. అది వుంటే మన దివాణా నికి ముప్పువాటిల్లుతుంది. కన్నయ్య బైటికి వెళ్ళిపోయింది కాబట్టి ఇంక మనం నిరభ్యంతరంగా, గాలిమర నిర్మాణంలో కృషిచేయవచ్చును. నేస్తాలూ! పైకి రావాలంటే దబాయింపు చాలా అవసరం - దబా యింపు నేస్తాలూ! దబాయింపు!"

జంతువులు రాడీని అర్థంచేసుకోలేక పోయాయి. గునపం, నిరంకుశంగా స్వార్థంకోసం కన్నయ్యని తరిమివేసినట్లుగా భావించాయి.

అంతలోకే కుక్కలూ, కోరగా జంతువులనైపు చూసి 'చెప్పినమాట వినకపోతే జాగ్రత్త,' అన్నట్లుగా కోపంతో గుర్రుపెట్టాయి. దాంతో జంతువులన్నీ హడలిపోయి ప్రశ్నలు వేయడంమాని, రాడీ చెప్పిందంతా బాగుందని తలలూపాయి.



# ౪

ఆ సంవత్సరమంతా, జంతువులన్నీ బానిసల్లా కష్టపడ్డాయి. ఎంత కాయకష్టపడినా, ఏది త్యాగంచేసినా వాటి సంతానానికే లాభదాయకమనీ, మానవరాక్షసులకు కాదనీ, జంతువులు అయిష్టత చూపకుండా ఆనందంతో పనిచేశాయి

వేసవికాలమంతా, వారానికి అరవైగంటలు పనిచేసినా, ఆదివారాల మధ్యాహ్నాలుకూడా పనిచేయాలని గునపం తెలియ పరచింది. నిజానికి ఆదివారాల మధ్యాహ్నంపూట జంతువులు పనిచేసి తీరాలని నిర్బంధంలేదు. కాని యేజంతువైనా పనికి రాకపోతే, దానికిచ్చే రేషను సగం తగ్గించబడేది. క్రితం సంవత్సరంకంటె ఆ సంవత్సరం పంటనాసిగా పండింది. కారణం దున్నడం ఆలస్యం అవడంచేత. పైగా రెండు పొలాలు ఉత్తబీడైపోయి ఎందుకూ పనికి రాక పోయాయి, అందుచేత వచ్చేసంవత్సరం గడ్డుగా ఉంటుందని జంతువులు భయపడ్డాయి.

గాలిమర, అనుకోని కష్టాలు తెచ్చిపెట్టింది. ఒక పొలంలో బోలెడంత కారురాయివుంది. దివాణం కొట్లలో కావలసినంత సిమెంటు, సున్నం, ఇసకా నిల్వచేయబడి ఉన్నాయి. గాలిమర కట్టేందుకు కావలసిన సామగ్రిఅంతా అందుబాటులోనే ఉంది కాని, కావలసిన సైజులోకి కారురాయి ఎలాబ్రద్దలు కొట్టడం? మానవులంటే సుత్తితోటీ గునపాలతోటీ తవ్వి బద్దలు కొట్టగలరు. కాని జంతువులు, వెనకకాళ్లమీద నిలబడి ఆ సాధనాలను ఎలా ఉపయోగించగలవు? ఆలోచించగా ఆలోచించగా చివరకు, భూమ్యాకర్షణశక్తిగురించి ఒక జంతువు మనస్సుకి తట్టింది. ఆ పొలంలో పడిఉన్న పెద్ద పెద్ద బండ రాళ్లకు తాళ్లుచుట్టి, జంతువులన్నీ కలిసి కొండమీదికి లాక్కెళ్లి ఆ ఎత్తులోంచి వాటినిక్రిందకు జారవిడచాయి. బ్రద్దలైన రాళ్లను కావలసిన చోటికి రవాణాచేయడమేమంత కష్టంగా తోచలేదు.

బళ్లనిండా రాళ్లేసుకుని గుర్రాలు లాగేశాయి. గొర్రెలూ, మేకలూ, ఒక్కొక్క రాయినీ చేరవేశాయి. చివరకు ముసలి వెంకన్నకూడా, చంద్రునికో నూలుపోగన్నట్లు, సహాయపడింది. వచ్చే వేసవికల్లా, కావలసిన కొరుకురాయిపోగైంది. పందుల యాజమాన్యం క్రింద గాలి మరకట్టడం ప్రారంభమైంది.

గాలిమర నిర్మాణం విసుగుకల్గించేపని. ఒక్కొక్కప్పుడు, ఒక పెద్దబండరాయిని కొండమీదికి దొర్లించుకుపోడానికి ఒకరోజంతా పట్టేది. తీరా దానిని, అక్కణ్ణించి తోస్తే, కిందపడి బద్దలవకపోడం కూడాకద్దు. అన్ని జంతువుల పెట్టూ పంచకల్యాణిది. పంచకల్యాణే లేకపోతే, ఏపనీ జరిగిఉండేదికాదు. బండరాయిని కొండెక్కిస్తున్నప్పుడు ఒక్కొక్క సమయంలో, అది కిందకి జారిపోయి, దానితో పాటు తక్కిన జంతువులనుకూడా వెనక్కిలాగేది. కిందకి జారిపోతూన్న జంతువులు గోలపెడితే పంచకల్యాణి ఒక్కర్తీ, తన బలమంతా ఉపయోగించి, బండరాయి జారిపోకుండా ఆపేది. ఒళ్లుహూనం అయేలా, అనవసరంగా, అంత యెక్కువగా హైరాణపడవద్దని జాకీమందలించినా, పంచకల్యాణి వినేదికాదు. పైగా, "నేనింకా కష్టపడతాను, గునపం ఏదిచెప్పినా ఒప్పే" అని మంత్రం పఠించి నట్లుగా అనేది.

రోజూ కూసేవేళకంటె ఒక ముప్పావుగంట ముందస్తిగా కూసిలేపమని, కోడితోచెప్పి పంచకల్యాణి ఒక్కర్తే, దేనిసహాయం లేకుండా, కొండమీదికిపోయి పగలగొట్టిన రాళ్లనన్నిటినీ, గాలిమర కడుతూన్నచోటికి తీసుకుపోయేది.

ఆవేసవికాలమంతా జంతువులు పుష్కలంగా తింటూ కష్టపడి పనిచేస్తూ హాయిగా ఉన్నాయి. మానవులకంటె జంతువులే కొన్ని కొన్ని పనులు ఎంతో శుభ్రంగానూ, చాకచక్యముతోనూ చేశాయి. పొలాలలో కలుపుతీయడం జంతువులు తీసినంత శుభ్రంగా మానవు లెప్పుడూ తీయలేదు. ఏజంతువూ, కడుపు కక్కూర్తికోసం దొంగతనం చేయవలసిన అగత్యం లేకపోవడంచేత, బీడుపొలాలకీ, పంట

పొలాలకీ మధ్య కట్టవాలు కట్టడం అనవసరమైంది. ఆ కట్టవాల జాగ్రత్తకోసం పూర్వం, మానవులు ఎంతేనా శ్రమపడేవాడు. కాని ఇప్పుడాశ్రమ తగ్గిపోయింది. ఐనప్పటికీ వేసవి కాలం వెళ్ళిపోగానే, తలవని తలంపుగా, జంతువులు అనుకోని ఆహారకొరతలకి లోనైనాయి. గుర్రాలకాళ్లకి, యెద్దులకాళ్లకి నాడాలు కావలసి వచ్చాయి. విత్తులూ, పొలాల కెరువులూ, ఇంకా ఇతరసామగ్రీ, ముఖ్యంగా గాలిమర నిర్మాణానికి కావలసిన మరలూ - ఇంకా ఎన్నో చిల్లర సామానులు కావలసివచ్చాయి. వాటన్నిటినీ ఎట్లా సంపాదించాలన్న సమస్య యేర్పడింది.

ఒక ఆదివారం ఉదయం, జంతువులన్నీ సమావేశ మవగానే గునపం ఒక విధానం సూచించింది.

"నేస్తాలూ! మనమిప్పుడు చాలా ఇబ్బందుల్లో ఉన్నాము. అత్యావసరమైన సామగ్రి కొరత తీర్చుకుందుకు, ఇరుగుపొరుగు విహాణాలతో వర్తకవ్యాపారాలు చేద్దాము. ప్రస్తుతం-అత్యావసరమైనది గాలిమర-గాలిమర కొనేందుకు ధనంకావాలి. మన పంటలోని కొంత భాగం అమ్మితేనేగాని, గాలిమర కొనేందుకు సరిపడే సొమ్మురాదు. కాబట్టి వట్టిగడ్డిమేటి ఒకటి, ఈ సంవత్సరం పండిన వరిపంటలోని సగంభాగం అమ్మడానికి బేరాలు చేయిస్తున్నాను. అప్పటికీ చాలినంత ధనం రాకపోతే, గుడ్లు అమ్మవలసి వుంటుంది. కోడిపిట్టలూ! బాతులూ! గాలిమరయంత్ర నిర్మాణంకోసం మీరు అంతమాత్రం త్యాగం చేయాలి!"

మళ్లా జంతువుల్లో కలకలం బైల్దేరింది. మానవులతో యెటువంటి సంబంధం ఉండకూడదనీ ఎటువంటి వర్తకవ్యాపారాలలోనూ జోక్యం కల్గించుకోకూడదనీ, డబ్బు వాడకూడదనీ— రత్తయ్యని తరిమి వేసినతర్వాత జరిగిన ప్రథమ సమావేశంలో ప్రమాణాలతో తీర్మానించడమైందే? నాలుగు చిన్నపందులూ, గునపం అనుసరించబోతూన్న వర్తక వ్యాపారవిధానం బాగా లేదన్నట్లు, భయంతో, భారంతో మూల్గడం మొదలెట్టగానే, కుక్కలు ఒక్క-మొరుగు మొరిగి,

పందులనోళ్లు మూయించాయి. మామూలుగానే మేకలూ, గొర్రెలూ “చతుష్పాదులు మంచివి — ద్విపాదులు చెడ్డవి” అని అరవడం మొదలెట్టాయి. ముందటి కాలెత్తి, గునపం, నిశ్శబ్దంగా ఉండమంది.

“నేస్తాలూ! వర్తకవ్యాపారం ద్వారా తిరిగి మానవులతో నేను సంబంధం కల్పించుకోబోతున్నానని మీరంతా అనుకుంటున్నారు. ఎప్పుడూ అలాఅనుకోకండి. వ్యాపారభారమంతా నా నెత్తిని వేసుకుని నేనే పని జరుపుతాను. అగ్రహారంసంతలో, వ్యాపారస్థులకి మధ్యవర్తిగా పనిచేస్తూన్న తిమ్మయ్య, ప్రతిసోమవారం ఉదయం మన దివాణంలోకి వచ్చి, బేరాలు కుదుర్చుకొని వెళుతూంటాడు...పశుస్వామికం చిరస్థాయిగా ఉండుగాక” అని అరచి, ‘మూగజీవాల ప్రబోధగీతం’ అందరితో కలిసి పాడి, గునపం సమావేశం చాలించింది.

తర్వాత, ఎప్పట్లాగే రౌడీ దివాణంచుట్టూ తిరిగి జంతువులకి గునపం వ్యాపారవిధానం గురించి, తబిసీలుగా చెప్పి సమర్థించింది. డబ్బు వాడకం గురించీ, వర్తకవ్యాపారాలు చేయడం గురించీ ఎప్పుడూ ఎటువంటి తీర్మానం అమలులోకి రాలేదనీ, ఒకవేళ అటువంటి ఊహా ఎవరికైనా ఉన్నప్పటికీ కన్నయ్య చేసిన దుష్ప్రచారమనీ చెప్పింది. ఐనా కొన్ని జంతువులు నమ్మకపోవడంచూసి, రౌడీ:

“నేస్తాలూ! మీ రేదో కల కని వుంటారు కాని, నిజానికి అటువంటి తీర్మానా లున్నాయంటారా? కాగితంమీద ఎక్కడేనా వ్రాసివున్నాయా ఆ తీర్మానాలు?” అని అడిగింది. జంతువులకి ఏమీ బోధపడక, అవే పొరబడ్డట్టు ఒప్పుకున్నాయి.

ప్రతిసోమవారం ఉదయం తిమ్మయ్య పశువుల దివాణానికి వచ్చేవాడు. అతనిని జంతువులన్నీ కోరచూపులతో చూసేవి కాని ఏజంతువూ దగ్గరకెళ్లి పల్కరించేదికాదు. చతుష్పాది గునపం ద్విపాది తిమ్మయ్యకి ఆజ్ఞలిస్తూంటే జంతువులు చూస్తూ చాలా గర్వపడేవి. తిమ్మయ్యద్వారా మానవులతో వర్తకవ్యాపారం జరపడం మొదలెట్టినంతమాత్రంచేత, మానవులు, పశువుల దివాణంపట్ల చూపే ద్వేష

భావం ఏంతమాత్రం తగ్గలేదు. జనమంతా రచ్చసావిడిలో మూగి, పశువుల దివాణంగురించీ, గాలిమర గురించీ తర్కవితర్కాలు చేసి, ఎప్పటికో అప్పటికి గాలిమర తప్పక నేలకూలిపోతుందనీ, పశువుల దివాణం తిరిగి తమహక్కు భుక్తమైపోతుందనీ, వారంతా ఏకాభిప్రాయానికొచ్చినా, పశుస్వామికపద్ధతి నిరాఘాటంగా, యెక్కువ చాకచక్యంతో నడుస్తూందనికూడా మెచ్చుకునేవారు లేకపోలేదు.

హఠాత్తుగా పందులన్నీ కలిసి, జమీందారుగారి భవనంలో నివసించడం ప్రారంభించాయి. పశుస్వామికం స్థాపించిన మొదటి దినాల్లో భవనంలో, ఏ జంతువూ నివసించకూడదని తీర్మానించిన సంగతి, జంతువులకి జ్ఞాపకమొచ్చింది. రాడీ, తిరిగి జంతువుల దగ్గిరకొచ్చి, పందులు భవనంలో నివసించడం సమర్థించింది.

“నేస్తాలూ! ఒక్కపందులే భవనంలో నివసించడం మీకెవ్వరికీ ఇష్టంలేకపోవచ్చును. కాని మెదడుతో పనిచేయవలసిన బాధ్యత పందులపై ఉంది కాబట్టి, మెదడుకి సంబంధించిన కార్యాలోచనలుచేయడానికి ప్రశాంతంగా ఉండే నివాసం అవసరం. అందుకొరకే అవి భవనంలో ఉంటున్నాయి. దీంట్లో ఈషణ్మాత్రం స్వార్థపరత్వం లేదు. పైగా మన నాయకుడైన గునపం, తన హోదా నిలబెట్టుకోవాలంటే, ప్రత్యేకమైన ప్రదేశంలో నివసించాలి.”

ఐనా పందులన్నీ కలిసి ప్రత్యేకజీవనం సాగించడం జంతువులకిష్టంలేకపోయింది. జంతువులన్నీ సమానమన్నప్పుడు, జీవనవిధానంలో మళ్ళా ఆ హెచ్చు తగ్గు లెందుకు? ఎందుకు పందులు ప్రత్యేకంగా వంటింట్లోనే తిండితినాలి? విశ్రాంతికోసం, పందులు పెద్ద హాలు నెందుకు ప్రత్యేకంగా వాడుకోవాలి? పైగా పరుపులమీద ఎందుకు నిద్రించాలి? పంచకల్యాణికి యేగొడవా అక్కర్లేదు. “గునపం ఏదిచేసినా ఒప్పే” అని మనస్సుని సమాధాన పరచుకుంది. కానీ జాకీ సప్తవిధులూ వ్రాసిన, గోడదగ్గిరకెళ్ళి, తల్పాలు వాడకూడదన్న సూక్తి చదవడం మొదలుపెట్టి, అర్థంకాక, పిచ్చాణ్ణిపిలిచి కొంచెం చదివిపెట్టమంది.

"పిచ్చాడూ, నాల్గోవిధి చదువుకొంచెం. ఏ జంతువూ పక్క మీద పడుకోకూడదనేకదూ దాని అర్థం?"

కష్టంమీద పిచ్చాడు ఒక్కొక్క అక్షరం కూడబలుక్కుని "దుప్పటేసుకుని పక్కలమీద ఏ జంతువూ పడుకోకూడదు' అని వ్రాసివుంది" అని చదివి చెప్పింది. దుప్పట్లు వేసుకుని పడుకోకూడదు అనే విషయం నాలుగో విధిలో మొదట వ్రాసిందీ లేందీ జాకీకి జ్ఞాపకంలేదు. కాని అప్పుడు చూస్తే, దుప్పట్లుఉన్న పక్కలమీద పడుకోకూడదు అని వ్రాసివుంది. జాకీ, పిచ్చాడూ అక్కడ నిలబడి ఆలోచిస్తూండగా, రెండుకుక్కలని వెంటేసుకుని నడిచిపోతూన్న నాడి, వాటిని చూసి—

"'జాకీ' ఏమిటి ఆలోచిస్తున్నావు? దివాణంభవనంలో, మేమంతా పరుపులమీద పడుకుంటూన్న సంగతి వినేవుంటావు. ఎందుకు పరుపులమీద పడుకోకూడదూ? ఎటువంటి నిషేధం లేదుగా? పక్క అంటే యేమిటి? పడుకునే చోటన్నమాట! ఇంత గడ్డి పరుచుకు పడుకుంటే, అదీపక్కే, మనం నిషేధించిందల్లా మానవులు వాడుకునే దుప్పట్లు. పందులన్నీ, మెదడుతో పనిచేసి ఎంతెంత కష్టపడుతున్నారో మీకందరికీ తెలుసునుగా! పందులకా మాత్రం సుఖం లేకపోతే పనిచేయలేవు. ఐనా, మర్యాదస్తయ్యా ఈ దివాణంలో అడుగుపెట్టడం మీ కిష్టంలేదుగా."

పందులు, పక్కలమీద పడుకోడానికి జంతువులన్నీ అంగీకరించాయి. కొద్దిదినాల తర్వాత అన్నిజంతువులకంటె పందులు వుదయం పూట ఒకగంట ఆలస్యంగా లేస్తాయని గూనవం తెలియపరిచింది. అందుకూ జంతువులు సమ్మతించాయి.

ఆకు రాలుకాలం రాగానే జంతువులన్నీ పనిచేసి అలసిపోయాయి. ఐనా సుఖంగా జీవితం సాగిస్తున్నాయి. ఒక గడ్డిమేటి, కొంతపంటా అమ్మివేయడం మూలాన తిండికి కొంత కొరత కల్గినప్పటికీ, గాలిమర ఒకటి తయారవుతుందనే ఆనందంలో, జంతువులు కష్టనష్టాలను మరిచిపోయాయి. గాలిమర కట్టడం సగం పూర్తయింది.

అంతలోకే వర్షాకాలం వచ్చింది. గాలిమర కట్టడం ఆగిపోయింది. ఒకరోజు రాత్రి ప్రళయంతో తుపానొచ్చి దివాణం భవనాన్ని కదిల్చివేసింది. ధాన్యపుకొట్టు కప్పుమీది పెంకులు ఎగిరిపోయాయి. కోడిపెట్టలన్నీ ఏదో పీడకల గన్నట్లు లేచి అడే కూయడం మొదలెట్టాయి. పశువుల దివాణం పతాక నెగురవేసిన స్తంభం నేలమీనికి ఒరగడం, పశువుల సావిడిదగ్గిరున్న బాదంచెట్టు వేళ్లతో సహా పెకలించుకు నేలమీద పడ్డంచూసి జంతువులన్నీ ఆశ్చర్యపోయాయి. అన్ని జంతువుల చూపులూ గాలిమరవైపు మళ్ళాయి. అన్నీ ఒక్కసారిగా 'మొర్రో'మని ఏడ్చాయి. గాలిమర మట్టిలో కలిసిపోయింది. ఒళ్లు హూనంచేసుకుని సంవత్సరమంతా కష్టపడ్డ ఫలమంతా బూడిదలో పోసిన పన్నీరైంది. కూలిపోయిన గాలిమర చూసి జంతువులు, మాట్లాడలేక నిశ్చేష్టతో, నిలబడిపోయాయి. [illegible] ముడుచుకుని, కాదోమరెత్తినట్లు అటూ, ఇటూ తిరిగి, ఏదో మనస్సుకు తట్టినట్లు, ఆగి :

"నేస్తాలూ! దీని కంతకీ కారణం ఎవరో తెలుసా? రాత్రి పూటవచ్చి గాలిమర నేలపాలుచేసి పారిపోయిన శత్రువులెవరో తెలుసా? కన్నయ్య! కన్నయ్య! అదే ఇంత పనిచేస్త! తనని తన్ని తరిమివేశామని, మనమీద ఈవిధంగా పగ సాధించుకుంది. ఇప్పుడే కన్నయ్యకి మరణదండన విధిస్తున్నాను! మీలో ఎవరైనా సరే, కన్నయ్యని పట్టి ఇక్కడికి తీసుకువచ్చినట్లయితే 'పశువీరుడు—రెండవ తరగతి' అని బిరుదూ, ఒక బుట్టెడు మామిడిటెంకలూ జామిపళ్ళూ బహుమానం!" అని గర్జించింది.

అంతపని కన్నయ్య చేసిందా అని జంతువులు ఆశ్చర్యపోయాయి. ప్రతిజంతువూ, కన్నయ్య నెట్లాగైనా పట్టితేవాలని కోపంతో ద్వేషంతో ఆలోచించింది. కొండ చేరువలో, గడ్డిమీద పందిఅడుగుల జాడలు కనిపించాయి. అవి, చూసి, గునపం కన్నయ్య, అబ్బాయి నాయుడుగారి దివాణంలోంచి గాలిమరవైపు వచ్చిందని, జంతువులకి చెప్పింది.

"నేస్తాలూ! ఇంక యెంతమాత్రం ఆలస్యం చేయవద్దు. మనకి చేతినిండా పనివుంది. తిరిగి గాలిమర నిర్మాణానికై పునఃప్రయత్నిం చేయాలి. వానసక వరదనక ఈ వర్షాకాలమంతా పనిచేసి గాలిమర పూర్తిగా కట్టివేయాలి. నడవండి! నడుములు బిగించండి. గాలిమర కలకాలం ఉండుగాక! పశువుల దినాణాం కలకాలం వుండుగాక" అని సునపం ఉద్రిక్తంగా ఉపన్యసించింది.

కరిచే సీతాకాలం వచ్చింది. బయటిప్రపంచమంతా పశువుల దివాణంచూసి వెక్కిరిస్తూందనీ, గాలిమర వేసవిలోపల పూర్తి అవకుండా ఉండాలని మానవులంతా పెయ్యిదేముళ్లకి మొక్కుతున్నారనీ తెలిసి జంతువులన్నీ పట్టుదలతో మర కట్టడం సాగించాయి.

పసువుల దివాణంచూసి సహించలేని మానవులంతా, కన్నయ్య వల్ల గాలిమర కూలిపోలేదనీ, దాని గోడలు బొత్తిగా సన్నంగా ఉండడంచేతనే కూలిపోయిందని అనడం మొదలెట్టారు. కాని, కన్నయ్య పనే అని జంతువులు గట్టిగా నమ్మాయి. రెండోమాటు కట్టేటప్పుడు మూడడుగుల దళసరి గోడలతో గాలిమర కట్టాయి. గోడలదళం పెంచగానే, యెక్కువ కారురాయి కావలసివచ్చింది. నిజానికి జంతువులు ఆ పని చేయలేక విసుగెత్తిపోయాయి. ఒక్క పంచకల్యాణి జాకీలుమాత్రం, విసుగెత్తక, కారురాయి పోగుచేయడంలో ఎంతో సహాయపడ్డాయి. కాడీమాత్రం పనిచేస్తున్న జంతువులదగ్గర కెళ్లి పనిలోని హుందాతనం గురించీ, త్యాగంగురించీ తీయతీయగా ఉపన్యాసమిచ్చేది. నిజానికి, పంచకల్యాణిని చూసి జంతువులన్నీ, నడుములు బిగించి పనిచేసేవి.

జనవరిమాసం వచ్చేటప్పటికల్లా ఆహారకొరతవచ్చి పడింది. రేషను తగ్గించి, ఒక్కొక్క కర్రపెండలం ముక్క ఇవ్వడమైంది. కాని అవికూడా సరిపోయేంత లేకపోయాయి.

కన్నయ్య ఆనుపానులు తెలుసుకునే నిమిత్తం కుక్కలను వెంటేసుకుని గునపం దివాణం నలుమూలలా తిరిగింది. మిగతా జంతువులు, భయంతో గునపం పరివారం వెన్నంటి బిత్తరిచూపులు చూస్తూ నడిచాయి. అడుగడుక్కీ ఆగి, నేలమీద కనిపించిన అడుగుల

జాబిలను వాసనచూసి కన్నయ్య అని గునపం నిశ్చయానికి వచ్చింది. కన్నయ్య పేరు ఎత్తగానే కుక్కలు పళ్లుకొరుకుతూ దానికోసం నలుమూలలా వాసనచూస్తూ వెతికేవి.

ఆవేళ సాయంత్రం జంతువులనన్నిటినీ సమావేశపరచి, భయ భ్రాంతులతో రాడీ ఇలా అంది.

"నేస్తాలూ! కన్నయ్యగురించిన వైనం తెలిసింది. అది అబ్బాయినాయకుడిగారితో లాలూచీ పడిందట. అబ్బాయినాయకుడుగారు, రహీంపూర్ జమీందారుగారికి సహాయపడి, మన దివానాపుమీదికి యుద్ధానికి రాబోతున్నారుట. యుద్ధసమయంలో కన్నయ్య, నాయకుడుగారికి తైనాతీగా పనిచేయబోతూంది. ఇక్కడ మనతో ఉన్నప్పటికీ, అధికారకాంక్షతో, మన పశుస్వామ్యానికి నియంతక్రింద ఉండాలని ప్రయత్నించింది. అంతెందుకు? రత్తయ్యతో లాలూచీపడింది. కన్నయ్య దేశద్రోహి! పశుస్వామిక ద్రోహి! దాని ద్రోహచర్యలన్నీ ఋజువుపరచేందుకు, చాలా విలువైన కాగితాలుదొరికాయి. గోశాల యుద్ధంలో, కన్నయ్య ఓటమికి మనం పన్నిన పన్నాగం మీకందరికీ తెలిసిందే. నిజంగా కన్నయ్యనే నమ్మివుంటే, ఆ యుద్ధంలో మనం ఓడిపోయి ఉండేవాళ్లం!"

జంతువులన్నీ ఆశ్చర్యంతో అలా నోటమాటలేక నిల్చిపోయాయి. గోశాలయుద్ధంలో కన్నయ్య, ఎటువంటి ధైర్యసాహసాలు చూపి, ప్రతిజంతువునీ ముందుకు హుంకరించమని ప్రోత్సహించి, రత్తయ్య గుండు దెబ్బకికూడా లెక్కచేయక, అతని కాళ్లమధ్యపడి రత్తయ్యని ఎలా నేలకూలేసిందో సమస్తం జంతువులు జ్ఞప్తికితెచ్చుకుని, రాడీమాటలు నమ్మలేకపోయాయి. పశుస్వామికంకోసం, సమస్తం ధారపోసిన కన్నయ్య తను కన్నకలకిరూపమైన గాలిమరను ధ్వంసం చేయగలదా? ఎటువంటి సందేహంపెట్టుకోకుండా, ఏపని చెపితే, ఆపని చేసుకుపోయే పంచకల్యాణికూడా రాడీమాటలు చెవినిపడగానే, గుంజాటనలో పడింది.

"గోశాలయుద్ధంలో కన్నయ్య ఎటువంటి ధైర్యంతోనూ, ఎటువంటి దేశభక్తితోనూ, యుద్ధం చేయలేదంటే నేను నమ్మలేకుండా ఉన్నాను రాడీ! 'పశువీరుడు - మొదటితరగతి' అనే బిరుదు, మనం దానికి ఇచ్చాంగా?"

"నేస్తం! మనం అక్కడే పొరబాటు పడ్డాము! అది జరిపిన రహస్యపత్రాలు చూస్తే కన్నయ్య దేశద్రోహి అని తెలిసిపోయింది. గోశాలయుద్ధంలో యుద్ధంచేస్తున్నట్లు నటించింది. అంతే."

"గుండుదెబ్బ తిందికూడాను. వెన్నమ్మట రక్తంకారుతూంటే కూడా లెక్క చేయకుండా ముందుకి ఉరికిందే! ఇదంతా నటనేనా!" అని పంచకల్యాణి ప్రశ్నించింది.

"రత్తయ్యతో లాలూచీపడింది కన్నయ్య. ఆ దెబ్బకూడా, తగిలించుకోవాలనే తగిలించుకుంది- మనని మోసగించేందుకు - ఈ విషయం కూడా, ఆ కాగితాల్లో నలుపు తెలుపులో వ్రాసివుంది. నిజంగా మన నేస్తం గునపమే లేకపోతే, మనం తప్పక ఓడిపోయి వుండేవాళ్లం. రత్తయ్య, తక్కిన మానవులూ తిరిగి దొడ్లోకిపారిపోతూంటే కన్నయ్య పారిపోవడం, దాని వెనకాతల కొన్ని జంతువులుకూడా పారిపోవడం మీకు జ్ఞాపకంలేదూ! మనలో కంగారు భయం కల్గుతూన్న సమయంలో 'మానవునికి మరణమే' అని అరుస్తు గునపం, ఎలా హుంకరిస్తు ముందుకి ఉరికి, రత్తయ్యపిక్క పట్టుకుని కండలూడేలా కరిచిందో జ్ఞాపకం తెచ్చుకోండి!" అని రాడీ విపులంగా గోశాలయుద్ధంగురించి సమీకరించింది.

జంతువులానాటి యుద్ధవిశేషాలను నెమరుకు తెచ్చుకున్నాయి. క్లిష్టసమయంలో కన్నయ్య వాళ్లకి బుద్ధిచెప్పిన విషయం వాటికి బాగా జ్ఞాపకముంది. కాని పంచకల్యాణీమాత్రం, రాడీ మాటలు నమ్మలేకపోయింది.

"ఏమైనా మొదటలో కన్నయ్య దేశద్రోహి అని నేను నమ్మలేకుండాఉన్నాను. రాడీ! దరిమిలాను దాని ప్రవర్తనలో మార్పువచ్చి

వుండవచ్చును. గోశాలయుద్ధంలో మట్టుకు కన్నయ్య, ఎంతో దేశ భక్తితో యుద్ధంచేసి, మనకి విజయం చేకూర్చిందనే నేను నమ్ము తున్నాను."

"మన నాయకుడు నేస్తం గునపం - మొదటినుంచీ చెప్తూనే ఉన్నాడు - కన్నయ్యా రత్తయ్యా లాలోచీ అని."

"అది వేరేసంగతి. మన నేస్తం గునపం అనూాలే అన్నాడంటే. అది వాస్తవమే అన్నమాట" అని పంచకల్యాణి కౌడీ మాటలతో ఏకీభవించింది.

"అలా నమ్మాలి నేస్తం!" అని నవ్వుతూ రౌడీ పంచకల్యాణి వేపు క్రీగంటితో చూచింది. వెళ్ళిపోతూ ఆగి, "ప్రతిజంతువూ జెయ్యి కండ్లతో నలుమూలలాపరికిస్తూ మసలుకోవాలని హెచ్చరిస్తున్నాను. ఎందుకంటే, కన్నయ్యతో లాలోచీ అయే గూఢచారులు మనలోనే కొన్నివున్నాయి."

సరిగ్గా పంటలు పండకపోవడంచేత రోజుల తరబడి జంతువులు తిండిలేక మలమల మాడిపోయాయి. పూర్తిగా కరువు సంప్రాప్త మౌతుందేమోనని జంతువులన్నీ భయపడ్డాయి.

పశువుల దివాణంలో కాటకం వచ్చిందని ప్రపంచానికి తెలియ నివ్వకూడదు. గాలిమర కూలి పోవడంతోటే, మానవులంతా, చంకలు గుద్దుకుంటూ ఆనందించారు. కాటకంకూడా, పశువుల దివా ణంలో వచ్చిందని వారికి తెలిస్తే, ఇంక వారుచేసే దుష్ప్రచారానికి హద్దుపద్దులుండవు. మానవులలో వ్యతిరేక ప్రచారం సాగించే నిమిత్తం గునపం తిమ్మయ్యని ఉపయోగించి, కొన్ని మేకలను తిమ్మయ్య వినేలా, రేషను హెచ్చించినట్లు కేకవెయ్యమంది. అంతేకాకుండా, ఖాయిదా కొట్టులోపడిఉన్న ఖాళీడబ్బాల నన్నిటినీ మట్టితోనింపి, పైనిమాత్రం నాల్గుగింజలు మట్టి కనిపించకుండా పోయమని, జంతువు లకి ఆజ్ఞఇచ్చింది. ఏదో మిషమీద తిమ్మయ్యని, ఖాయిదా కొట్టులోకి తీసికెళ్ళి ఆమట్టితోనింపిన డబ్బాలను గునపం అతనికి చూపించింది.

నిల్వచేసిన ఆహారంచూసి, తిమ్మయ్య ఆశ్చర్యపోయి పశువులు ఎంత మాత్రం కరువుచేత బాధపట్టంలేదని, కావలసినంత ఆహారం నిల్వచేసుకున్నాయనీ బైట ప్రపంచానికి తెలియచేసి, మానవులుచేస్తున్న దుష్ప్రచారాన్ని అరికట్టాడు.

జనవరి మాసాంతానికి ఎక్కణ్ణించైనా కొంత ఆహారం సేకరించవలసిన అగత్యం కల్గింది. ఆదినాల్లో, నలుగురిలోకి గునపం రావడం బొత్తిగా మానేసింది. భవనం ప్రతి గుమ్మంవద్దా ఒక్కొక్క కుక్క ఫహరా ఇచ్చేది. ఒకవేళ యెప్పుడైనా గునపం బైటికివస్తే, కుక్కల సిబ్బందీ వెంటేసుకుని, నాయకుణ్ని హుందాతనంతో నడిచేది. ఆదివారాల సమావేశాలకికూడా రావడంమానేసి, కాడీద్వారా ఉత్తర్వులను గునపం జారీచేసేది.

ఒకనాడు ఆదివారం ఉదయం అప్పుడే గుడ్లుపెట్టేందుకు వచ్చిన కోడిపెట్టలతో కాడీ ఇలా అంది :

“కోడిపెట్టలూ! మీరు పెట్టబోయేగుడ్లన్నీ, నాకు అప్పచెప్పాలి. వారానికి నాల్గువందల గుడ్లు సప్లై చేయడానికి తిమ్మయ్యతో గునపం కరారు చేసుకుంది. గుడ్లు అమ్మగా వచ్చినసొమ్ముతో వేసవివరకూ సరిపోయేంత గ్రాసం కొనవచ్చును లేకపోతే కరవుతో మనమంతా మాడిపోవాలి.”

కోడిపెట్టలు గొల్లుమని యేడ్చాయి. అటువంటి త్యాగం చేయవలసివుంటుందని, ముందుగానే గునపం చెప్పినా అప్పట్లో కోడిపెట్టలు నమ్మలేదు. పెట్టినగుడ్లు తీసుకపోవడం, హత్యకన్నా హీనమైనపని అని కాడీతో కోపంగాఅన్నాయి. మూడు కోడిపుంజుల నాయకత్వంకింద, గునపం ఉత్తర్వుని ధిక్కరించేందుకు, కోడిపెట్టలు లేచాయి. పశువుల సావిడీ కప్పుమీదకి ఎగిరిపోయి, అవి కమ్మీలమీద గుడ్లుపెట్టాయి. పెట్టిన గుడ్లన్నీ నేలమీద పడి చితికిపోయాయి. ఆవిధంగా నాయకుని ఉత్తర్వుని అవి ధిక్కరించాయి. గునపానికి పట్టరాని కోపమొచ్చి కోళ్లకు తిండిపెట్టకూడదని శాసించి, ఏజంతువైనా కోళ్లకి ఒక్క

గింజైనా పెట్టినట్లయితే, మరణ దండన విధించ బడుతుందని హెచ్చరించింది. ఆ ఆజ్ఞను ఆచరణలో పెట్టేందుకు కుక్కలు నియమించబడ్డాయి. ఐదు దినాలవరకూ కోళ్లు నిరశనవ్రతం సాగించాయి. తర్వాత ఆగలేక ఎప్పట్లాగే అమర్చబడిన పెట్టెల్లోకి వెళ్ళిపోయి గుడ్లు పెట్టడానికి ఒప్పుకున్నాయి. తిండిలేక తొమ్మిది కోళ్లు చచ్చిపోయాయి. తిమ్మయ్య కాసంగతి తెలియనివ్వలేదు. ఎప్పట్లాగే కరారు ప్రకారం తిమ్మయ్య వచ్చి గుడ్లు తీసుకు పోతున్నాడు.

కన్నయ్యవైనం ఎంతమాత్రం తెలియలేదు. అభ్యాఘనాయుడు గారి దివాణంలోనో ఎక్కడో మాత్రం అది దాక్కుని ఉన్నట్లు పుకారు చెలరేగింది. చుట్టుపక్కలఉన్న దివాణాలతో, గుసపం స్నేహభావం పెంచుకుంటూవచ్చింది. పశువులదివాణంలో ఒకమూలగా, టేకుబాజులు కుప్పగా వేసివున్నాయి. వాటి నమ్మివేయమని గుసపానికి తిమ్మయ్య సలహాఇచ్చాడు. ఆకలప కొనేందుకు ఇరుగుపొరుగువారు పోటీపడ్డారు. ఎవరి కమ్మడానికి గుసపం నిశ్చయించు లేకపోయింది.

మళ్లా కన్నయ్య పశువులదివాణంలో దూరి విధ్వంసక చర్యలు సాగిస్తూందని పుకారులు చెలరేగాయి. ధాన్యం దొంగిలించడం, పాలకుండలు తన్నివేయడం కోడిగుడ్లు చితకగొట్టడం, ఆకుమళ్లు తొక్కి పాడుచేయడం జరిగింది. చివరకు పశువులదివాణంలో ఏ చిన్న అవాంతరంకల్గినా కన్నయ్యపనే అని జంతువులన్నీ అనుకునేవి. కిటికీతలుపు విరిగిపోయినా, కుళ్లుకాలవ మూసుకుపోయినా, కన్నయ్యే కారణమని జంతువులు, దాన్ని దుమ్మెత్తిపోసేవి. ఒకసారి, నిల్వకొట్టుతాళంపోతే, కన్నయ్య వచ్చి ఆ తాళంతీసికెళ్లి నూతిలో పడేసిందని జంతువు లనుకున్నాయి. దరిమిలాని పిండిబస్తా వెనకాతల తాళంచెవి దొరికినా, జంతువులు కన్నయ్యగురించి యేర్పరచుకున్న అభిప్రాయం మాత్రం మార్చుకోలేదు. నిద్రపోతుండగా, సాలలోకి కన్నయ్యొచ్చి పాలుపితికేసి పారిపోయిందని ఆవులన్నీ గోలపెట్టాయి.

కన్నయ్య కూటంలో జేరడంచేతనే ఎలుకలు అలా మారాం చేస్తున్నాయని జంతువుల విశ్వాసము.

నాల్గుదినాలతర్వాత జంతువులను సమావేశం కావలసిందని గునపం ఉత్తర్వు జారీ చేసింది. తనకుతానే 'పశువీరుడు - మొదటి తరగతి - పశువీరుడు - రెండవతరగతి' అని రెండుపతకాలు తయారు చేయించుకుని ధరించి కుక్కలను వెంటేసుకుని గునపం, సమావేశానికి హాజరైంది. కుక్కలనుచూడగానే జంతువులన్నీ హడలెత్తిపోయాయి. జంతువులవైపు గునపం ఒక్కసారి తేరిపారి చూసింది. తక్షణం కుక్కలు ముందు కురికి, ఒక నాలుగుపందులను నోళ్లకి కరుచుకుని లాక్కొచ్చి గునపం కాళ్లముందర పడేశాయి. పందుల చెవులమ్మట రక్తం ఏకధారగా కారుతూంటే కుక్కలు నాక ప్రారంభించాయి. ఆదివారపు సమావేశాలు గునపం ఉపసంహరించినప్పుడు, ఆ నాల్గు పందులే వాటి అయిష్టత తెల్పాయి. ఆ పందులు నాలుగూ హడలెత్తిపోయి నిలబడి తాము రహస్యంగా కన్నయ్యతో లాలోచీపడి, గాలిమర విధ్వంసానికి సహాయపడినట్లూ, అబ్బాయినాయుడు గారికి పశుస్వామికాన్ని అప్పచెప్పడానికి కన్నయ్యతో వ్రాతకోతలు జరుపుకున్నట్టూ, సత్యప్రమాణం చేసి యథార్థం చెప్పాయి. కొన్ని సంవత్సరాలపట్టీ, రత్తయ్యతో లాలోచీపడి తాను పనిచేస్తున్న సంగతి కన్నయ్య వాటితో చెప్పినట్టుగా కూడా పందులు చెప్పాయి. పందుల వాఙ్మూలం తీసుకోగానే కుక్కలు వాటిమీదపడి గొంతుకలు కొరికి పారేశాయి.

అంతలోకీ, జంతువులు విస్తుపోయేలా ఒకమూడు కుక్కలు పంచకల్యాణిమీద కురికాయి. పంచకల్యాణి, ముందు కాలొక్కటెత్తి ఒకకుక్కని నేలమీద అణచివేసింది. 'రక్షించు! రక్షించు' అని గోల పెట్టగానే, తక్కిన రెండుకుక్కలూ తోకలు ఝాడించి పరుగెత్తుకు పోయాయి. కాలికిందఉన్న కుక్కని చంపేయమంటావని పంచకల్యాణి ప్రశ్నార్థకంగా నాయకుని వేపు చూసింది. వదిలివేయమని సంజ్ఞ చేయగానే, పంచకల్యాణి కుక్కని వదిలేసింది. వంటినిండా

గాయాలతో అది 'కుయ్యో'మంటూ నడవలేక నడవలేక కుంటుకుంటూ నడిచిపోయింది.

"ఇంకా యే జంతువేనా చెప్పుకోవలసిందేమైనా ఉందా?" అని గునపం పెద్ద కేక వేసింది.

కోడిగుడ్లగురించి, నాయకున కెదురు తిరిగిన మూడు కోడి పెట్టలూ ముందుకొచ్చి, కలలో కన్నయ్య వాటికి కనిపించి గునపం చెప్పినమాట వినవద్దని చెప్పినట్లు చెప్పాయి. ఆ నిమిషాన్నే మూడు కోళ్లూ చంపబడ్డాయి.

తర్వాత ఒక బాతు ముందు కొచ్చి - "క్రితం సంవత్సరం పంటనుంచి కొంతధాన్యం దొంగలించి, రాత్రిపూట తిన్నాను" అంది.

"కన్నయ్య చెప్పేడు మాటలువిని, తాగే మంచినీటి చెరువులో అల్పాచమానంచేశాను" అని గొర్రె లెంపలేసుకుంది.

"మీకు అప్తురాలైన ముసలిగొర్రెను, మమ్మల్ని నిద్రపోనీయకుండా రాత్రిళ్లు దగ్గుతూండడంచేత, మేము తరిమి తరిమి చంపి వేశాము" అని మరో రెండు గొర్రెలు చెప్పాయి. అక్కడే వాటి నన్నిటినీ, గునపం చంపించి వేసింది.

ఆమోస్తరుగా వాజ్మూలాలు తీసుకోడం తత్ఫలితంగా మరణ దండనలూ జరిగాయి. ఎటుచూసినా రక్తపాతమే, అటువంటి రక్త పాతం, రత్తయ్యని తరిమివేసిన తర్వాత ఎన్నడూ జరగలేదు.

అంతా ఐపోయిన తర్వాత, ఒక్క పందులూ కుక్కలూతప్ప తక్కిన జంతువులన్నీ భయంతో మెల్లగా జారిపోయాయి. మృత్యు వాతపడిన జంతువులు, నిజంగా నేరస్థులో లేక నాయకుని దురంత కృత్యమో- వాటికేమీ అర్థమవలేదు. పూర్వంజరిగిన రక్తపాతంకంటె ఇప్పటి రక్తపాతం ఘోరంగాతోచింది. పశువులదివాణం వదలి రత్తయ్య వెళ్లిపోయిన దినంనుంచీ అప్పటివరకూ ఏజంతువూ మరో జంతువుని చంపలేదు. చివరకు ఎలకలనుకూడా ఏజంతువూ చంపలేదు.

జంతువులన్నీ జాకీ, పిచ్చాడు, వెంకన్నా, ఆవులూ, గొర్రెలూ, మేకలూ, బాతులూ, కోడిపెట్టలూ - ఒక్క పిల్లితప్ప-అన్నీ, గాలిమర ప్రాంతంలోకి వెళ్లి నేలమీదబరిగాయి. కొంచెంసేపటివరకూ, ఏజంతువూ మాట్లాడలేదు. పంచకల్యాణిమాత్రం నేలమీదపడుకోక అలా నిలబడేవుంది, తోక ఇటూ అటూ ఆడిస్తూ పచారుచేస్తూ:

"వాకంతా అగమ్యగోచరంగావుంది నేస్తాలూ! మనదివాణంలో అటువంటి రక్తపాతం జరుగుతుందని ఎన్నడూ కలలోనైనా అనుకోలేదు. మనలో ఏదో దుర్బలత్వం వుందికాబట్టే, ఈవేళ అన్ని నిండుప్రాణాలు, నిర్నిమిత్తంగా మృత్యువాతపడ్డాయి. దీనికంతకీ మందేమిటంటే, ఇంతకంటె యెక్కువగా కష్టపడి పనిచేయడమే. ఇకనుంచి నేనుప్రతిరోజూ, మామూలుకంటె ఒకగంట ముందుగా నిద్రనుండిలేచి పనిచేయ నిశ్చయించాను" అంటూ పంచకల్యాణి కంకరరాళ్ల గుట్టవైపు నడిచిపోయి పొద్దుగూకేవరకూ పనిచేసి, రెండుబళ్ల కారురాయి ఈడ్చుకొచ్చి గాలిమరదగ్గిర పోసింది.

జాకీదగ్గిరగా జంతువులన్నీ చేరాయి. ఆ ఎత్తుప్రదేశంమీదకి పశువులదివాణం యావత్తూ ఎంతోబాగా కనిపిస్తుంది- ఆపచ్చనిచేలూ, ఆతాగే చెరువులూ-భవనాలూ-సాలలూ, జాకీ ఒక్కసారి తేరిపారి చూసి కంటనీరెట్టుకుని-

"మానవజాతినుండి దాస్యవిముక్తికోసం పాటుపడ్డామంటే, ఈ నిరంకుశత్వ పరిపాలనకోసంకాదు. ఇన్నాళ్లూ, ఎండనక కొండనక, వానసక వరదనక, ఒళ్లుదాచుకోకుండా, కాయకష్టంపడ్డామంటే గునపంవంటి నిరంకుశునికింద దాస్యం చేయడానికికాదు. రత్తయ్య ఉన్నా లేకపోయినా, దాస్యంమాత్రం మనని పట్టిపీడలేదు. ముసలిపంది ఇటువంటి పశుస్వామికాన్ని గురించి చెప్పలేదే, అదికన్నకలల కర్థమిదా? అంగరం, ఎటువంటు మొరమరికాలేకుండా ఒకరికొకరం సహాయపడుతూ, సమానావకాశాలతో సమానహక్కులతో బ్రతుకుతా మనుకున్నాను" అని లోలోపల ఆలోచించసాగింది.

నిజానికి సంపాదించుకున్న పశుస్వామికాన్ని పోగొట్టుకుందామనే ఉద్దేశం జాకీ మనస్సులో లేదు. ఏది ఎలాఐనా రత్తయ్యనిమాత్రం తిరిగి రానియ్యడంగురించి జాకీ ఏన్నడూ ఆలోచించలేదు. ఏంజరిగినా, ఎటువంటి రక్తపాతం జరిగినా, నాయకునిమాట శిరసావహించి, మునపటిలాగే, ఇంకాఎక్కువగాకష్టపడి పనిచేసేందుకే నిశ్చయించింది జాకీ. ఈ నిరంకుశత్వ పరిపాలనకొరకే, జంతువులు, గాలిమర నిర్మాణంలో ఎముకలు సున్నమయేలా పనిచేసింది? రత్తయ్య తుపాకీగుళ్లకి ఎర అవుత, గునపం నాయకత్వంకోసంకాదే! ఆలోచనలు మనస్సును కలచి వేస్తుంటే జాకి, మనశ్శాంతికోసం "మూగజీవాలు" పాడడంప్రారంభించింది. తక్కిన జంతువులుకూడా జాలిగాపాడాయి.

పాడడం పూర్తయిందో లేదో రెండుకుక్కలను వెంటేసుకుని రాడీ అక్కడికొచ్చి –

"నేస్తాలూ! ఇకనుంచి ఆ పాటపాడడానికి వీలులేదని నాయకుని ఆజ్ఞ" అని చెప్పింది.

నిశ్చేష్టతతో జంతువులన్నీ బిక్కముఖాలువేశాయి.

"ఏం? ఎందుచేత?" అనిపిచ్చాడు రాడీని అడిగింది.

"ఆ పాట అవసరం తీరిపోయింది. విప్లవానికిచెందిన దా పాట. దేశద్రోహుల మరణదండనలతో విప్లవంపూర్తయింది. కాబట్టే ఆపాట అవసరం తీరిపోయింది. ఇంటా బైటా పొంచివుండిన శత్రువు అంత మొందాడు!"

పాట రద్దుపరచడానికి వీలులేదని, జంతువులు వాటి అసమ్మతిని తెల్పుదామనుకున్నాయి కాని, ఇంతలోకే మేకలు 'మే ఏ ఏ' అంటూ 'చతుష్పాదులు మంచివి ద్విపాదులు చెడ్డవి' అని ఊరికే అరవడం మొదలెట్టాయి.

ఆ విధంగా 'మూగజీవాలు' చరమగీతి ఐపోయింది. దానికి బదులుగా కవి కూనీ ఒక పాటవ్రాసింది.

పశుదివాణము !

పశుదివాణము !

పరుల కెప్పుడపకారము సేయడు ॥ ప ॥

ప్రతి ఆదివారం ఉదయం, జండాఎగరవేయగనే, జంతువు లాపాటపాడేవి. కాని, ఆ మాటలు కాని, ఆ వరసకాని, జంతువులకి మూగజీవాలంత నచ్చినట్లుగా నచ్చలేదు.









## ౮

మరణదండనల ఫలితంగా కలిగిన భీతి కొంతవరకూ తగ్గింతర్వాత, కొన్ని జంతువులకి సప్తవిధులలోని ఆరవసూక్తి జ్ఞాపకానికొచ్చింది:

"ఏజంతువ్వూ మరే ఇతరజంతువునీ చంపకూడదు"

పందులముందుగాని. కుక్కలఎదటగాని ఆ ఆరవసూక్తి ఉచ్చరించడానికి భయపడినా, పశుస్వామికమతానికి విరుద్ధంగా మరణదండనలు విధించబడ్డాయని మాత్రం జంతువ్వులకి అర్థమైంది.

జాకీ, వెంకన్నని పిలిచి, ఆరవసూక్తి చదవమంది. కాని తానెటువంటి జోక్యం కల్గచేసుకోనంటూ వెంకన్న, పిచ్చాణ్ణిపిల్చి గోడమీదవ్రాసిన ఆరవసూక్తి జాకీకి చదివిపెట్టమంది.

"అకారణంగా ఏజంతువ్వూ, మరే ఇతరజంతువునీ చంపకూడదు!"

"అకారణంగా" అన్నమాట, జంతువులకి మునుపటినుంచీ ఉందా లేక, దరిమిలాను వ్రాయబడిందా అనే సందేహం తోచలేదు. ఆసూక్తి చదివేక గునపంవేసిన మరణదండనలు న్యాయమైనవేనని, అవి మనస్సుకి నచ్చచెప్పుకున్నాయి.

క్రితం సంవత్సరంకంటె ఆసంవత్సరం జంతువులు ఎక్కువగా పనిచేసినా, రత్తయ్య హయాంలో ఎంత తిండి లభించేదో, అంతే ప్రస్తుతంలోకూడా లభించింది. కాని రాడీ మాత్రం, పంటలగురించి పెద్ద పెద్ద లెక్కలుచెప్పి, జంతువులను కుషామత్తు చేసేది. జంతువులు రాడీ మాటలువిని, అన్యాయం జరుగుతున్నసంగతి మాట మర్చిపోయి చాలా గర్వపడేవి.

మునపట్లా. గునపం తరుచు,జంతువులకి కనుపించడం మానే తుంది. ఏ పది పదిహేనుదినాలకో ఓమాటు బైటికివచ్చినా, కుక్కలు వెంటనడవగా, ఒకకోడి ముందుగా వైతాళికుడులా కూస్తూ నడిచేది. గునపం మాట్లాడేముందు కోడి గట్టిగా, జంతువులను నిశ్శబ్దంగా ఉండమని కూసేది. గునపం, ప్రత్యేకంగా, దివాణం భవనంలో నివసిస్తున్నట్లు కూడా వినికిడి. రెండుకుక్కలు కాపలాకాస్తూంటే గునపం ఒక్కడే కూర్చుని భోంచేసేది. తన పుట్టినరోజునాడుకూడా, చిహ్నంగా తుపాకీ కాల్చవలసిందని ఉత్తర్వు జారీ చేసింది.

మునుపు గునపాన్ని మామూలుగా పేరెట్టి పిలవడంకద్దు. కాని ఇప్పుడు 'మన నాయకుడు, నేస్తం గునపం' అని పిలవాలని ఆజ్ఞఐంది. తిర్యగ్జంతు పితామహుడు, మానవులపాలిటి కౄరస్వప్నుడు, అజాదళరక్షకుడు, బాతులమిత్రుడు మొదలైన బిరుదులతో గునపాన్ని పందులు పిల్చేందుకు ఇష్టపడేవి. తన ఉపన్యాసాల్లో రాజీ ఆనంద భాష్పాలు రాలుస్తూ నాయకుణ్ణి పొగిడేది.

"మన నాయకుడు యెంత తెలివైనవాడని! ఎటువంటి విశాల హృదయం! ఎక్కడఉన్నా, ఏపనిలో నిమగ్నమైనా, తనజాతిపట్ల ఎటువంటి గాఢమైన ప్రేమఅనీ! ఇతర దివాణాలలో దాస్యపు మనుగడ సాగిస్తున్న జంతువులగురించి, వాటి విముక్తి గురించి ఎంత ఇదిగా తాపత్రయంపడతాడనీ!" ఏ అదృష్టంపట్టినా, ఏ విజయంకల్గినా, గునపంనాయకత్వ ఫలితమే అని జంతువులు నమ్ముతూ వచ్చాయి.

"మన నాయకుడు నేస్తం గునపం నాయకత్వం క్రింద ఆరు దినాలలో నేను ఐదుగుడ్లుపెట్టాను" అని ఒకపెట్ట మరోదానితో అనేది.

చెరువులో నీళ్లు తాగుతూ—

"నేస్తం గునపం నాయకత్వానికి మనం ఎంతేనా కృతజ్ఞులం! ఈనీరెంత తీయగావుంది" అని ఆవులు ఆప్యాయంగా నీళ్లుత్రాగేవి.

కవి _ కూనీ 'నేస్తం గునపం' అనే పాటవ్రాసింది. నాయకుడు గునపంపట్ల జంతువుల కేవిధమైన భక్తి వినయవిధేయతలున్నాయో. ఆ పాట తెల్పుతుంది.

అనాథులందరికి ఆప్తమిత్రుండు
ఆనందనిలయమ్ము అతని హృదయమ్ము!

చండభాస్కరు నెవడు తేరిచూడగలండు.
అతడె మానాయకుడు అతడె మానేస్తం!

అతడె మాగునపం! ధీర లలితుం డతడు
ధీరశాంతుం డతడె ధీరుండతండె!

ఈ జంతుజాతి కీవె జీవమ్మోయి!
కడుపునిండాతిండి కంటినిండానిద్ర

కరుణించి కాపాడువాడె మానేస్తం!
వాడె మాగునపం!

కవి-కూనీ వ్రాసినపాట బాగావుందని శ్లాఘించి, సప్తవిధుల ప్రక్కనే, ఆపాటకూడా వ్రాయించవలసిందని గునపం ఉత్తర్వు జారీ చేసింది. పాటకి పైగా రాడీ చిత్రించిన గునపం పటం తగిలించడం కూడా జరిగింది.

తిమ్మయ్యద్వారా జరుగుతూన్న కలపబేరంలో గునపం ఏ అభిప్రాయానికీ రాలేదు. పైగా అబ్బాయినాయుడుగారు, పశువుల దివాణంమీద విరుచుకు పడేందుకు ప్రయత్నాలు చేస్తూన్నట్లూ కన్నయ్యకూడా సహాయపడుతూన్నట్లూ పుకారు చెలరేగింది. మూడు కోడిపెట్టలు ముందుకొచ్చి, కన్నయ్యప్రోద్బలంతో, గునపాన్ని హత్య గావించే పితూరీలో, సాయపడ్డామని చెప్పడంతో ఈ జంతువులన్నీ హడలెత్తిపోయాయి. తక్షణం, కోడిపెట్టలు మృత్యువాతపడ్డాయి. గునపం ప్రాణరక్షణకై తగినజాగ్రత తీసుకోవడమైంది. నాలుగుకుక్కలు, రాత్రిపూట గునపం ప్రక్కచూట్టూ కాపలాకాసేవి. చిన్నపంది పెంకిపిల్ల గునపం తినే ఆహారం ముందుగా రుచిచూసి, ఎటువంటి విషప్రయోగ చిహ్నాలూ లేవని గ్రహించేందుకూ, గునపం ఆహారానికి హామీగా ఉండేందుకూ నియమించబడింది.

పోతురాజుతో గునపం కలపబేరం ఖాయపరచింది. తదితర వస్తువులనుకూడా పశువుల దివాణంనుంచి కొనడానికి అతను గునపంతో మాటఖరారు చేసుకున్నాడు. వేసవికాలం గడిచిపోతూన్న కొద్దీ, శత్రుభయం హెచ్చయింది. తుపాకులతోసహా ఒక ఇరవై మంది మనుష్యులను వెంటేసుకుని అబ్బాయినాయుడుగారు దివాణం మీద పడబోతున్నాడనీ, కత్తులు కటపాలు దొంగిలించేముందు పోలీసులకి లంచాలిచ్చి తనకి మద్దత్తుగా వుంచుకున్నాడనీ పుకారు చెలరేగింది.

పైగా పశువులదివాణం మీది కోపంకొద్దీ అబ్బాయినాయుడుగారు, తమదివాణంలోని జంతువులను క్రూరంగా హింసిస్తున్నాడట. ముసలిగుర్రాన్ని కొరడాతోకొట్టి చంపాడట. తిండి పెట్టకండా ఆవులను మలమల మాడ్చివేశాడట. కోళ్ళకాళ్లకి కత్తులుకట్టి పోట్లాటపెట్టి అవి, ఒకదానిపీక మరొకటి కోసుకుంటూంటే చూసి ఆనందించేవాడట. అబ్బాయినాయుడుగారి క్రూరచర్యలు వింటూన్నప్పుడల్లా జంతువులన్నీ కోపంతో ఉడుకెత్తిపోయి, అబ్బాయినాయుడుగారి దివాణంమీదికి విరుచుకుపడి, ఆయన్ని తరిమేసి అక్కడిజంతువులకి విముక్తి కల్గిద్దామని అనుకునేవి. కాని రాడీ, ఆవిధమైన తొందరపని, ఎటువంటిది చేయవద్దనీ, అన్నిటికీ నేస్తం గునపాన్నే నమ్మమనీ, అతనే క్రమంగా అన్నిజంతువులకీ విమోచన కల్గిస్తాడనీ జంతువులకి సలహాఇచ్చింది.

ఏమైనా అబ్బాయినాయుడుగారు జంతువులకి పరమశత్రువై పోయాడు. ఒక ఆదివారం ఉదయం గునపం, జంతుసమావేశానికి హాజరై తాను కలప యెన్నడూ అబ్బాయినాయుడుగారికి అమ్మదలచ లేదనీ, అటువంటి దుర్మార్గునితో ఎటువంటి సంబంధం పెట్టుకోలేదనీ చెప్పింది.

విప్లవంగురించి బైట ప్రచారం సాగిస్తూన్న పావురాలని, అబ్బాయినాయుడుగారి దివాణం పొలిమేరల వైపైనా వెళ్లవద్దనీ, 'మానవజాతికి మరణం' అనేసూత్రానికి బదులుగా, 'అబ్బాయి నాయుడికి చావుతప్పదు' అనే కేకలు వేయమనీ, గునపం ఉత్తర్వు

జారీచేసింది. ఆరోజుల్లోనే కన్నయ్య దురంతం మరొకటి బైటపడింది. వరిచేలల్లో కలుపు ఎక్కువ పెరిగిపోయింది. దానికి కారణం విత్తులు చల్లేజంతువుతో కన్నయ్య లాలోచీ పడి కలుపువిత్తులు కలపడంచేతనే వరిచేలన్నీ బీడులైపోయాయనీ తెలిసింది. విత్తులు చల్లేజంతువు యథార్థం చెప్పి, నేపాళంకాయలుతిని ఆత్మహత్య చేసుకుంది. 'పశువీరుడు - మొదటితరగతి' అనే బిరుదు, గోశాల యుద్ధానంతరం కన్నయ్యకి ఎవ్వరూ ఇవ్వలేదనీ, కన్నయ్యే ఆబిరుదు తనపేరుకి తగిలించుకుందనీ, జంతువులనుకోడం మొదలెట్టాయి.

జనవరి మాసాంతికల్లా, కష్టంమీద గాలిమర నిర్మాణం పూర్తైంది. ఎటొచ్చీ యంత్రం తెచ్చి స్థాపించాలి. కష్టపడికట్టిన గాలిమర చూసుకుని జంతువులు గర్వంతో మురిసిపోయేవి. మునపటికంటె, రెండింతల దళసరిగా గాలిమరగోడలు అవి కట్టాయి. ఏదైనాపుందుపెట్టి పగలకొట్టవలసిందేకాని, ప్రాణిశక్తికా మర నిర్భేద్యము. గాలిమర తిరుగుతూంటే, విద్యుచ్ఛక్తి ఉత్పన్నమవడం-ముందు ముందు ఎక్కువ విశ్రాంతికల్గడం మొదలైన భావిభాగ్యంగురించి కలలుకంటూ జంతువులు ఛాతీలువిరుచుకు, గాలిమరచుట్టూరా వానాకుప్పతిరిగాయి. కుక్కుట వైతాళికుడు 'కొక్కొరోకో' అంటూ కూస్తూ ముందు నడుస్తూంటే కుక్కలను వెంటేసుకుని గునపం గాలిమరదగ్గర కొచ్చి జంతువులను చూసి మందహాసంతో అభివందనాలర్పించి;

"నేస్తాలూ! ఈగాలిమరకి 'గునపం మర' అని నామకరణం చేశాను" అని చెప్పింది.

రెండుదినాల తర్వాత, పాతరకొట్టులో జంతువుల ప్రత్యేక సమావేశం జరిగింది.

"నేస్తాలూ! అబ్బాయినాయుడుగారికి కలప అమ్మివేశాను. రేపు రెండెడ్ల బళ్లు తెప్పించి, నాయుడుగారి బంట్రోతు కలప తోలించుకుపోతాడు."

జంతువులనోట మాట రాలేదు. అంతవరకూ అబ్బాయి

నాయుడుగారి పట్ల శత్రుత్వం వహించిన నాయకుడు, ఆయనతో ఇప్పుడు నేస్తం కలుపుకోడం ఆశ్చర్యం కల్గించింది. నిజానికి, పోతురాజుతో కలప అమ్మకంగురించి బేరసారాలు చేస్తున్నా, అబ్బాయినాయుడు గార్ని పైకి తిడుతూన్నా లోలోపల రహస్యంగా, గునపం ఆయనతో స్నేహం చేస్తున్న సంగతి ఏజంతువుకీ తెలియదు.

పోతురాజుతో ఉంటూన్న బాంధవ్యం పూర్తిగా గునపం తెంచేసుకుంది. పైగా అతనినిగురించి అవమానకరచేలా, పావురాల ద్వారా, నానాకూతలూ కూయించింది. 'పోతురాజుకి మరణాంతప్పదు' అంటూ పావురాలు పోతురాజు దివాణంమీద కెగిరి అరిచాయి.

"నేస్తాలూ! అబ్బాయినాయుడుగారు మనమీదకి దండెత్తి వస్తున్నాడన్నది ఉత్తప్రచారం. అటువంటిమాటలు నమ్మకండి. వారి దివాణంలోని జంతువులను అతిక్రూరంగా హింసిస్తున్నాడన్నదీ ప్రచారమే. ఈదుష్ప్రచారానికి కారకులెవ్వరో తెలుసా? కన్నయ్య, దాని సహచరులూను. పైగా కన్నయ్య అబ్బాయినాయుడుగారి దివాణంలో ఉండటంలేదట-చాలాకాలంపట్టి. అది పోతురాజుదగ్గర వుంటూందట."

గునపం నక్కజిత్తులమారితనం చూసి జంతువులు ఆనందంతో పొంగిపోయాయి. పోతురాజుతో స్నేహంగా ఉంటూన్నట్లు నటించి, అబ్బాయినాయుడుగారికి కలప హెచ్చుధరకి గునపం అమ్మిన సంగతి కూడా జంతువులు గ్రహించి 'భేష్' అని అని నాయకుణ్ణి మెచ్చుకున్నాయి.

"ఎవ్వర్ని, చివరకు అబ్బాయినాయుణ్ణికూడా మననేస్తం నమ్మదు. అందులోనేవుంది మననాయకుని ఘనత! నేస్తాలూ! అబ్బాయినాయుడు, కలపబాపతు సొమ్ము, చెక్కురూపంలో ఇవ్వబోయాడు. కాని నేస్తం నాణాలరూపంలోనే చెల్లించవలసిందని పట్టుబట్టి ఖచ్చితంగా చెవులు వడేసి వసూలుచేసింది. ఆ డబ్బుతో గాలిమరకి కావలసిన యంత్రం కొనవచ్చును" అని రౌడీ గునపం మేధాశక్తిగురించీ వర్తక వ్యాపార చతురతగురించీ జంతువులకి చెప్పింది.

పాతరకొట్టు దొడ్లో మరో ప్రత్యేక సమావేశం జరిగింది. వీరపతకాలు వెంటనే ధరించి చిరునవ్వుతో, గడ్డిగద్దెమీద కూర్చుని గునపం ప్రతి జంతువునీ, వచ్చి పళ్లెంలోవుంచిన ధనాన్ని పరీక్షించవలసిందని అడిగింది. ఒక్కొక్క జంతువూ ధనాన్ని కన్నులకరువు తీరేలా పరీక్షించింది. పంచకల్యాణి ముక్కుతో వాసనచూసింది.

మూడుదినాల తర్వాత, పశువుల దివాణంలో పెద్ద అలజడి చెలరేగింది. సైకిలు తొక్కుకుంటూ, కంగారుగా తిమ్మయ్యవచ్చి, తిన్నగా భవనంలోకి పరుగెత్తాడు. గునపం గదిలోంచి పెద్దపెద్ద కేకలు వినిపించాయి. అబ్బాయి నాయుడిచ్చినసొమ్ము దొంగనోటులన్న వార్త దివాణమంతా ప్రాకింది. తక్షణం జంతువులను సమావేశపరచి, అబ్బాయినాయుడిపై, గునపం మరణశిక్ష విధించింది. నాయుడు ప్రాణాలతో పట్టుబడ్డనాడు, అలానే ఉడక పెట్టాలంది.

“నేస్తాలూ! వాడు మనకి పరమశత్రువు. నమ్మించి మిత్రద్రోహం చేశాడు. కొంతమంది మనుష్యులను వెంటేసుకుని, వాడు ఏ నిమిషానైనాసరే మనపైకి విరుచుకుపడొచ్చును. అందుచేత అందరూ జాగ్రత్తగా మసులుకోండి. దివాణంద్వారాలవద్ద కొంతమందిని కావలా వుంచండి. పోతురాజుస్నేహాన్ని అర్థించేందుకు నాల్గు పావురాలను ఉత్తరమిచ్చి పంపాను. జాగ్రత్తగా ఉండండి.”

అనుకున్నదంతా జరిగింది. ఉదయమే జంతువులు తిండి తింటూంటే, ద్వారాలు బద్దలుకొట్టి, అబ్బాయినాయుడు లోనపడ్డాడని, కాపలా జంతువులు, పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పాయి. ధైర్యంతో యుద్ధంచేయడానికి జంతువులు సిద్ధబడ్డాయి. కాని, పోయినసారి గోశాలయుద్ధంలో కల్గినంత సులువుగా విజయంచేకూరే సూచనలు కనిపించలేదు. ఆరు తుపాకులు పట్టుకుని పదిహేనుగురు మనుష్యులు లోనప్రవేశించడం తడవుగా కాల్చడం మొదలైంది. జంతువులు గుళ్ల దెబ్బలకి తట్టుకోలేకపోయాయి. జంతువులను పారిపోవద్దని, గునపం, పంచకల్యాణీ కేకలెట్టాయి. కాని అవితోకలు ముడిచాయి. కొన్ని, గుళ్లదెబ్బలకి బలి ఐపోయాయి. జంతువులు భయపడి భవనంలోదూరి

తలుపు వేసుకుని, తలుపు సందుల్లోంచి బైటజరుగుతూన్న యుద్ధం చూశాయి. పశువుల దివాణం - గాలిమర సహా - శత్రుహస్తగతమై పోయింది. గునపానికి, యేంచేయడానికీ, పాలుపోయిందికాదు. పోతు రాజు సహాయంగురించి ఆలోచించింది. అంతలోక్కీ, పోతురాజుదగ్గిరకి పంపిన నాలుగు పావురాలూ, ప్రత్యుత్తరం పట్టుకొచ్చాయి.

అనుకోకుండా అబ్బాయి నాయుడు బృందం గాలిమరప్రాంతం చేరింది. ఆ దృశ్యాన్ని జంతువులన్నీ ప్రాణాలు ఉగ్గబెట్టుకు చూస్తున్నాయి. గాలిమర తవ్వేందుకు ఇద్దరు మనుష్యులు, గునపం పార పట్టుకు సిద్ధమవుతున్నారు

"అసంభవం! గాలిమరగోడలు తవ్వడం వాళ్లతరంకాదు. ఒక వేళ తవ్వడానికి పూనుకుంటారే అనుకుందాము. సరిగ్గా తవ్వేందుకు ఒకవారం పడుతుంది. ఫర్వాలేదు! ధైర్యంగా ఉండండి నేస్తాలూ!" అని గునపం జంతువులకి ధైర్యం చెప్పింది.

మనుష్యుల ప్రవర్తనమాత్రం ముసలి వెంకన్న చాలా జాగ్రత్తగా పరిశీలిస్తోంది. గాలిమర పునాదిలో, ఆ మనుష్యులు ఒక కన్నం చేస్తున్నారు.

"అనుకుంటూన్న దేజరుగుతూంది. ఆ కన్నంలో ఇంత మందు కూరుతారు. కూరి నిప్పంటిస్తారు! ఇంక గాలిమర ఎక్కడ నిలుస్తుంది?" అని వెంకన్న కళ్లు మూసుకుంది.

ఏ నిమిషాన్ని గాలిమర కూలిపోతుందో అని హడలెత్తిపోయి జంతువులన్నీ కన్నీళ్లు కార్చాయి. కొద్దినిమిషాలైనతర్వాత, అన్ని దిక్కులకీ మనుష్యులు పారిపోయారు. తర్వాత పెద్దశబ్దంతో గాలిమర రూపులేకుండా చెల్లా చెదరైపోయింది. ఆ శబ్దానికి జంతువులు హడిలి పోయి, కళ్లూ చెవులూ మూసుకున్నాయి. శబ్దం తగ్గిపోగానే జంతువులు కళ్లు తెరచిచూస్తే, గాలిమర ప్రదేశంలో పెద్దపొగతప్ప మరేమీ కనిపించలేదు. గాలిమర నేలకూలిపోయింది!

గాలిమర కూలిపోడం చూడగానే జంతువులకి ఎక్కడ లేని మొండిధైర్యం వచ్చింది. 'ప్రతీకారం, ప్రతీకార' మంటూ ఒక్కసారిగా బైటకివచ్చి, అవి శత్రువులమీదకి విరుచుకు పడ్డాయి. గుళ్లు దూసుకు పోతూన్నా అవి లెక్కచేయ లేదు. పోరు ఘోరంగా సాగింది. మానవులు, తుపాకులు అదే పేల్చడం మొదలెట్టారు. జంతువులు దగ్గిరకి రావడంతోనే, కర్రలతో కొట్టి, కాళ్లతో తన్నారు మానవులు. ఒక ఆవు, మూడు మేకలూ, రెండు బాతులూ, చచ్చిపోయాయి. తక్కిన జంతువులు గాయపడ్డాయి. చివరకు గునపం తోక చివర ఒక గుండు దూసుకుపోగా కొన్ని వెంట్రుకలు రాలిపోయాయి. ఇంక శత్రువులలో, పంచకల్యాణి తావులతో ముగ్గురి తలలు పగిలిపోయాయి. మరొకడి కడుపు. ఆవు కొమ్ములు గుచ్చుకుని చీల్చుకుపోయింది. రెండు కుక్కలు ఒక మనిషి కట్టుకున్న పంచి చీల్చి పూర్తిగా చింపేశాయి.

గునపం కాపలాకుక్కలు తొమ్మిదీ, డొంక చాటునుంచి మను ష్యులమీద కురకగానే, వారు హడలెత్తిపోయారు. సారిపొమ్మని అరుస్తూ, అబ్బాయినాయుడు కాళ్లకి బుద్ధిచెప్పాడు. పొలాలమ్మటపడి అడ్డదిడ్డంగా పరుగెడుతూన్న మానవులను, జంతువులు తరిమి తరిమి తన్నులు తన్నాయి. ముళ్ల డొంకలని లెక్కచేయక, మానవులు ప్రాణాలతో దివాణంనుండి బైటపడ్డారు.

ఆ రెండవ యుద్ధంలోకూడా జంతువులదే అఖండవిజయం. కాని రక్తసిక్తమైపోయాయి వాటి తనువులు. తోటిజంతువులు కొన్ని నేలమీద చచ్చిపడి ఉండడంచూసి, అవి కంట నీరెట్టుకున్నాయి. గాలి మర నిల్చిన తావుదగ్గరకిపోయి కొద్దినిమిషాలపాటు విచారంతో నిల బడ్డాయి. గాలిమర, నామరూపాలు లేకుండా నాశనమైపోయింది. అవి పడిన కష్టమంతా బూడిదలో పోసిన పన్నీరైంది. కొంతమట్టుకు పునాదులు కూడా ధ్వంసమయాయి. పైగా పునర్నిర్మాణానికి రాలి పోయిన రాళ్లను ఉపయోగించేందుకు వీలుండదు. కారణం, రాళ్లు కూడా నుసి ఐపోయాయి. నుసికాకుండా మిగిలినవి నలుదిక్కులా చెల్లా చెదరైపోయాయి. అలిసిపోయి, కుంటుతూ, తూలుతూ బడలికతో

జంతువులు దివాణం చేరుతూండగా, గెంతుతూ నవ్వుకుంటూ రాడీ వాటి కెదురుగా వచ్చింది. యుద్ధం జరుగుతూన్నప్పుడది ఎక్కడికి వెళ్ళిందో ఎవరికీ తెలియదు.

దివాణం భవనాల ప్రాంతంనుంచి, తుపాకీ కాల్చినశబ్దం రాగానే "తుపాకీ ఎందుకు పేలుస్తున్నారు?" అని పంచకల్యాణి ప్రశ్నార్థకంగా రాడీవైపు చూచింది.

"మనం సాధించిన విజయచిహ్నంగా!"

"విజయం యేమిటి?"

"ఏం విజయం అని అడుగుతావేమిటి పంచకల్యాణీ? మన నేలమీదనుంచి - పరమపవిత్రమైన మన పశువులదివాణంనుంచి శత్రువులను ఓడించి తరిమివేశాముగా!"

"కాని, వాళ్ళు గాలిమర నాశనంచేశారు. దానిని కట్టేందుకు మనం రెండుసంవత్సరాలు, రాత్రింబగళ్లు కష్టపడ్డాము!"

"ఐతే యేం! మరో మర కట్టుకుందాము. మనం తల్చుకుంటే, ఒకటికాదు, అరడజను గాలిమరలు కట్టివేయగలము. ఎంత అద్భుతంగా యుద్ధంచేసి మానవులకి బుద్ధిచెప్పామని! అంతా గునపం నాయకత్వం వల్లనే అనుకో!"

"ఐతే, రాడీ! నీవనేది, మనం మళ్ళా మన దివాణాన్ని సంపాదించుకున్నామన్నమాట! ఔనా!"

"అదే! మరి మనం యుద్ధం నెగ్గామన్నమాటేగా!" అని రాడీ ఆనందం పట్టలేక గెంతింది.

పంచకల్యాణి, యుద్ధంలో బాగా దెబ్బలుతింది. దాని మోకాళ్లమ్మట రక్తం కారుతూంది. ఒక కాలిడెక్క పూర్తిగా చీలిపోయింది; వెనక కాలి చట్టలో ఒక అరడజనుగుళ్లు దూరిపోయాయి.

జంతువులన్నీ కుంటుకుంటూ దొడ్లో చేరుకున్నాయి. గుళ్ల దెబ్బలతో పంచకల్యాణి చాలా బాధపడింది. గాలిమర కట్టవలసిన

పని తిరిగి ప్రారంభించాలని అది మనస్సులో నిశ్చయించుకుంది. అదే మొదటిసారి పంచకల్యాణి, తన వయస్సుగురించి ఆలోచించడము. పది కొండు సంవత్సరాలొచ్చాయి. మునుపున్న శక్తితో తిరిగి పనిచేయ గలనా అని అది అనుకుంది.

పచ్చజండా ఎగురుతూండడం - ఏడుసార్లు తుపాకీ పేల్చడం - విజయోత్సాహంతో, జంతువుల నన్నిటినీ అభినందిస్తూ గునపం ఉపన్యసించడం - చూసి జంతువులు అమితానందం పొందాయి. యుద్ధంలో ప్రాణాలు ధారపోసిన జంతువులకి, వీరోచితమైన దహనసంస్కారం జరిగింది. విజయోత్సవాలు రెండుదినాలు జరిగాయి. పాటలతో, ఉపన్యాసాలతో మిన్నుమ్రోగిపోయింది. పెద్దపెద్ద విందులు జరిగాయి. గాలిమర వద్ద జరిగిందికాబట్టి 'గాలిమరయుద్ధం' అని గునపం రెండవ యుద్ధానికి పేరెట్టింది. 'పచ్చబావుటా రక్షకుడు' అనే బిరుదు గునపం తనకు తానే స్వీకరించింది. అబ్బాయినాయుడు చెల్లనినాణాలలో కలప ఖరీదు చెల్లించాడన్నమాట, ఆ విజయోత్సవ సంభ్రమంలో, జంతువులు మరిచిపోయాయి.

కొన్ని దినాలతర్వాత దివాణంభవనంలోని సారాసీసాల పెట్టె పందులకళ్ల పడింది. ఒకరోజు రాత్రి భవనంలోపలినుంచి 'మూగజీవాలపాట' గట్టిగా బైటికి వినపడింది. ఆ రాత్రే తొమ్మిదిన్నర దాటింతర్వాత గునపం బైట కొచ్చి, దొడ్డిచుట్టూ గంతులేసి లోపలికి పారిపోయినట్లు జంతువులు కనిపెట్టాయి. కాని తెల్లారిమాత్రం దివాణం భవనం అతి నిశ్శబ్దంగా, ఎటువంటి అలజడీ లేకుండాఉంది. తెల్లారి తొమ్మిదవుతుంది. తేలిపోతూన్న నిద్రబద్ధకంతో, తూలుతూ నడుస్తూ రాడీ బైటికొచ్చి—

"నేస్తాలూ! నాయకుడు గునపం మరణశయ్యమీద ఉన్నాడు" అని విచారంగా జంతువులకి చెప్పింది.

ఒక్కుమ్మాటుగా జంతువులన్నీ బొరుమంటూ యేడ్చాయి. భవనంలోకి నడిచిపోయేదారంతా గడ్డితో కప్పబడివుంది. నిమ్మదిగా

చప్పుడు చేయకుండా, బొటనవేళ్లమీద నడుచుకుంటూ గునపాన్ని చూడ్డానికని, లోపలికి వెళ్లాయి.

“మన నాయకుడు మరణిస్తే ఎలాగ?” అని అవి ఒకదానినొకటి ప్రశ్నించుకున్నాయి. గునపం తినే ఆహారంలో రాడీ విషం కల్పిందని పుకారు బైల్దేరింది. భవనం విడిచి తిరిగి వెళ్లిపోతూన్న జంతువులను ఆపి —

“నేస్తాలూ! నాయకుని అంతిమ ఉత్తరువు ఏమిటంటే - ఏ జంతువు త్రాగినా మరణశిక్ష విధించబడతుం”దని చెప్పి రాడీ వెళ్లిపోయింది.

గునపం సాయంత్రానికల్లా ఆరోగ్యంగా కనిపించింది. సారా తయారీ విషయమై చదివేందుకుగాను, ఏదేనా ఒక పుస్తకాన్ని. ప్రక్కవూళ్లోకొని తెమ్మనమని గునపం తిమ్మయ్యతో చెప్పినట్లు వినికిడి. జామితోట కవతలగా, గొడ్లుమేసేందుకు కేటాయించిన పచ్చికబీడు దున్నమని, గునపం ఆజ్ఞాయిచ్చింది. ఎందుకో అని జంతువులు విస్తుపోయాయి. ఆ పొలంలో గంజాయిమొక్కలు గునపం నాటించింది.

ఆ దినాలలోనే ఒక వింత జరిగింది. కాని ఏ జంతువుకీ బోధపడిందిగాదు. ఒకరోజు రాత్రి పన్నెండు ఘంటలవేళ దొడ్లో పెద్ద చప్పుడైంది. నిద్రపోతూన్న జంతువులు ఉలిక్కిపడి లేచి శబ్దంవచ్చిన ప్రదేశానికి పరుగెత్తాయి. సప్తవిధులూ వ్రాసిన గోడక్రిందుగా నిచ్చెన రెండు ముక్కలుగా విరిగి పడివుంది. ఆ నిచ్చెన ప్రక్కనే లేవలేక లేవలేక లేస్తూన్న రాడీ వాటికికనిపించింది. కొంచెందూరంగా లాంతరూ, కుంచా, తెల్లరంగుకుండా పడివున్నాయి. రాడీ లేవగానే, కుక్కలు దానిని నెమ్మదిగా నడిపించుకుని భవనం చేర్చాయి. జంతువుల కేమీ అర్థమైందికాదు. వెంకన్న మాత్రం, అర్థమైనట్లు తలవూపింది. కాని పైకి ఏమీ చెప్పలేదు.

కొద్ది దినాల తర్వాత, పిచ్చాడు సప్తవిధులూ తనలో తాను చదువుకుంటూంటే, మరొక క్రొత్తవిధి, గోడమీద కనిపించింది. ఐదో

విధి ఏమిటంటే—"ఏ జంతువూ మద్యపానము చేయకూడదు." ఆ విధికి బదులుగా "ఏ జంతువూ మితిమీరి మద్యపానము చేయకూడదు" అనే మార్పు కనిపించింది.



౭

పంచకల్యాణి డెక్కకు తగిలిన గాయం మానడానికి చాలా కాలం పట్టింది. అంత పెద్దగాయంతగిలి బాధపడుతూన్నా, పంచకల్యాణి ఒక్కదినమైనా విశ్రాంతి తీసుకోక గాలిమర పనిలో మునిగిపోయింది. సాయంత్రంపూట మాత్రం, రహస్యంగా జాకీకి, తనకాలు అపరిమిత మైన బాధపెడుతోందని చెప్పేది. గింజలు నమిలి పిండిగా తయారు చేసి, ఆ పిండితో జాకీ వెంకన్నా కలిసి, చీలిపోయిన డెక్కకి కట్టుకట్టి ఎక్కువ పనిచేయవద్దని పంచకల్యాణిని మందలించేవి. కాని అది మాత్రం యెవ్వరి మాటా వినేదికాదు.

"నేస్తాలూ! నా కోరిక ఒక్కటే! నేను ముసలిదాన్నైపోయి, పింఛినీ పుచ్చుకునేలోపుగా గాలిమరనిర్మాణం పూర్తవాలి. దానివల్ల, పశువులన్నీ సుఖపడాలి. అందుకోసమే, కష్టమైనా, నిష్ఠూరమైనా ఎండైనా, వానైనా సరే కష్టపడి పనిచేస్తున్నాను; ముందుముందు కూడా చేసితీరుతాను!"

పశువుల దివాణం శాస్త్రాలను క్రోడీకరించినప్పుడు పందులకీ, గుర్రాలకీ పింఛినీ పుచ్చుకునే వయస్సు పన్నెండు సంవత్సరాలనీ, ఆవులకు పధ్నాలుగనీ, కుక్కలకి తొమ్మిదనీ, మేకలకీ గొర్రెలకీ ఏడనీ, కోళ్లకీ బాతులకీ ఐదనీ నియమించడమైంది. వృద్ధాప్యపు పింఛినీలు కూడా వున్నాయి. కాని అప్పటివరకూ ఏ జంతువూకూడా పింఛినీ పుచ్చుకోలేదు. ఐనా పింఛినీ విషయమై సమాలోచనలు జరగడం ప్రారంభమయాయి. గంజాయిమొక్కలు నాటేందుకు గాను ఎలాగైతే కొంతనేల కేటాయించడమైందో ఆమోస్తరుగానే, పింఛినీ పుచ్చుకున్న జంతువులు మేసేందుకుగాను, పెద్ద పొలం మూలనున్న చెక్క కేటాయించడమౌతూన్నట్లు జంతువులకి తెలిసింది. పింఛినీగా, గుర్రానికి, రోజుకి మూడుసేర్ల గోధుమలూ, సీతాకాలంలో ఒక మోపు పచ్చగడ్డి, పండగ దినాలలో, ఆ కాలంలో కాసే పళ్లు ఒక గంపెడూ, ఇచ్చేందుకుగాను పశుస్వామిక ప్రభుత్వ నిర్ణయమని కూడా తెలిసింది.

ఆలోపుగా జీవితాలు దుర్భరమైపోయాయి. పంటలు సరిగ్గా పండలేదు. దాంతో ఆహారకొరత యేర్పడింది. తిరిగి ఒక్క పందులకీ కుక్కలకీ ఇచ్చే రేషనుతప్ప, తక్కిన జంతువుల రేషను తగ్గించడమైంది.

"అందరికీ సమానంగా రేషనివ్వడం పశు స్వామిక సిద్ధాంతానికి విరుద్ధం. నేస్తాలూ! రేషను పెట్టామని అనుకోడమేకాని, నిజానికి, మనకి ఆహారకొరత లేదన్న సంగతిమాత్రం మరవకండి. ఆహారం సద్దుతున్నాము. సరిపెడుతున్నాము—అందరికీ. ఔనా! అంతేకాని తగ్గించడంలేదు. రత్తయ్యపెట్టే తిండికీ, ఇప్పుడు మనం తింటూన్న తిండికీ ఎంతేనా తేడావుంది. కావలిస్తే, లెక్కలు చదువుతాను వినండి," అంటూ రౌడీ లెక్కలేవో గబగబా చదివి—

"నేస్తాలూ! బోధపడిందా? మనకి ధాన్యానికీ గడ్డికీ లోటులేదు. రత్తయ్యకాలంలో పనిచేసినట్లుగా మనమంతా పాటుపడ నవసరంలేదు. కావలసినంత విశ్రాంతి. ఎంత పరిశుభ్రమైన నీళ్లు త్రాగగల్గుతున్నామిప్పుడు! అన్నిటికంటే, మునపటికంటె ఇప్పుడెక్కువకాలం బ్రతుకుతున్నాము; మనసంతానం చిన్నప్పుడే చచ్చిపోడంలేదు. ఎన్నడైనా సుఖంగా, ఈగల భాధలేకుండా, మనం గడ్డిమీద హాయిగా పడుకుని యెరుగుదుమా? అంతా మననేస్తం నాయకత్వమహిమే! ఏమంటారు నేస్తాలూ?"

జంతువులన్నీ రౌడీమాటలు నమ్మాయి. నిజానికి రత్తయ్య కాలంలో కంటె ఇప్పుడే సుఖానికి దూరమయాయి. ప్రస్తుతంలో,నిద్రపోయేవేళ మినహాయిస్తే తక్కినకాలమంతా వళ్లు హూనమయేలా పనిచేస్తున్నాయి. ఐనా జంతువులకి ఇప్పుడే సుఖంగా ఉంది. కారణం పూర్వం అవి రత్తయ్య బానిసలు; ఇప్పుడో, స్వేచ్ఛగా స్వతంత్రంగా జీవించే జీవులు!

నాలుగు ఆడపందులూ మొత్తం ముప్పైఒక్క పందిపిల్లలను పెట్టాయి. అన్నీ గునపం పోలికనేవున్నాయి. పందిపిల్లలు చదువు నిమిత్తం ఒక పాఠశాల దివాణం భవనం తోటలో కట్టాలని గునపం

తెలియపరచింది. ప్రస్తుతంమట్టుకు, గునపం వాటిని వంటగదిలో కూర్చోపెట్టుకుని చదువుచెప్పడం ప్రారంభించింది. ఇతర పందిపిల్లలతోగాని, ఇతర జంతువుల పిల్లలతోగాని కలిసి ఆడుకోక, వేరే తోటలోనే ఆ పందిపిల్లలు ఆడుకునేవి.

ఆ దినాలలోనే గునపం ఒక కొత్తనిబంధన జారీచేసింది. ఏ జంతువైనా, తన కెదురుగా ఏ పందైనా వస్తూన్నప్పుడు, దారికడ్డుగా వుండక, మర్యాదగా తొలగి నిలబడి దారినియ్యవలెననీ, ఏ పందయినా పచ్చే, ఆదివారాలనాడు తోకకి ఆకుపచ్చ రిబ్బను కట్టుకోడానికి హక్కు కలదనీను.

ఆ సంవత్సరము కరువులేకుండానే గడిచిపోయింది. కాని ధనం కావలసివచ్చింది. గాలిమర నిర్మాణం, అదనంగా పాఠశాల నిర్మాణం, ఈ రెంటికీ ధనం ఎక్కువగా కావలసివచ్చింది. చిల్లర ఖర్చులేవో ఉండిపోయాయి. భవనం దీపాలకి కిరసనాయిలు కొనాలి. కొవ్వొత్తులు కొనాలి. పంచదార తిన్నట్లయితే లావెక్కుతామనే మిషమీద, తక్కిన పందులు తినకూడదని గునపం నిషేధించినా, తనుమాత్రం పంచదార లేందే భోజనం ఆరగించేదికాదు.

డబ్బు నిమిత్తం ఒకగడ్డిమేటీ, మొదటి పంటబాపతు బంగాళాదుంపయీ అమ్మేయడమైంది. వారానికి ఆరువందల గుడ్లు సరఫరా చేయడానికి నిశ్చయించింది. నాయకుని నిరంకుశత్వానికి కోడిపెట్టలు గొల్లుమని యేడ్చాయి. వాటిజాతి నాశనమైపోతుందని యేడ్చాయి. డిసెంబరులో తగ్గించిన రేషను ఫిబ్రవరి మాసాంతానికి మరింత తగ్గించడమైంది. నూనె ఖర్చు తగ్గించేనిమిత్తం సాలల్లో దీపాలు నిషేధించబడ్డాయి. ఏ ఇబ్బందులు వచ్చినా, జంతువులే బాధపడేవి. పందులు ఎటువంటి ఇబ్బందులకీ గురి అవలేదు; పైగా అవి రానురాను బలపడం మొదలెట్టాయి.

ఒకనాడు మధ్యాహ్నం, ఏదో వండుతూన్న వాసన పశువుల చివాణమంతా అలముకుంది. సగ్గుబియ్యం ఉడకపెడుతూన్న వాసనని

జంతువులనుకున్నాయి. తమకు పెట్టడానికి సగ్గుజావ తయారవుతూందని, జంతువులన్నీ లొట్టలేశాయి. కాని అటువంటిదేమీ లేదు. సారా తయారవుతూన్న సంగతి వాటికి తెలిసింది. రోజూ ప్రతిపందికీ ఒక పైంటు సారా రేషను ఇవ్వడమైందనీ, ప్రతిరోజూ ఒక గేలను సారా గునపం త్రాగుతూందని జంతువులకి తెలిసింది.

రాను రాను కష్టాలెక్కువైపోతూన్నా, హాయిగా బ్రతుకుతున్నామనే సంతృప్తిలో ఆ కష్టాలను జంతువులు మర్చిపోయాయి. దివాణంలో ఎప్పుడూ బృందగానాలూ, ఉపన్యాసాలూ, ఉత్సవాలూ, ఊరేగింపులూ ఉంటూ వచ్చాయి. వారానికోమాటు, ఏదో ఒక ప్రదర్శనం వుండాలనీ తద్వారా పశువుల దివాణం కష్టసుఖాలు ప్రదర్శితం కావాలనీ, నాయకుడు గునపం ఆజ్ఞాపించాడు. ప్రదర్శనం ప్రారంభమయే సమయానికి పనిచేస్తున్న జంతువులన్నీ ఎక్కడివక్కడ ఆపేసి, దివాణంచుట్టూ కవాతులో నడవాలి_ పందులు ముందు నడుస్తూంటే, వెనక గుర్రాలూ, ఆవులూ, మేకలూ, గొర్రెలూ, బాతులూ, కోళ్ళూ, కుక్కలూ, బారులుతీర్చి నడవాలి. వీటన్నిటికీ ముందుగా వైతాళికుడు కుక్కుటం నడవాలి_ డెక్కా, కొమ్మూ చిహ్నాలుండి 'నేస్తం గునపం చిరకాలం జీవించాలి' అనే మాటలుగల పచ్చబావుటాను జాకీ, పంచకళ్యాణీలు ఎగరవేస్తూ నడవాలి. తర్వాత గునపం పేరుప్రఖ్యాతులను నుతిస్తూ వ్రాసిన పద్యాలు పఠించడం, ఆహారోత్పత్తి గురించి తబిసీళ్లిస్తూ రాడీ ఉపన్యసించడం, చివరకు తుపాకీ పేల్చడం - అవీ ఆ ప్రదర్శనాలలోని వింతలూ, విశేషాలూ. అన్నింటికన్నా, ఆ ప్రదర్శనాలలో గొర్రెలూ మేకలూ ఎక్కువ ఉత్సాహంతో పాల్గొనేవి. ఒకవేళ ఎప్పుడైనా, ఏజంతువులైనా, ఆ ప్రదర్శనాలపట్ల అయిష్టత చూపించడం తటస్థిస్తే, మేకలూ గొర్రెలూ పసిగట్టి 'చతుష్పాదులు మంచివి, ద్విపాదులు చెడ్డవి' అని చెవులు గింగురుమనేలా అరిచేవి. జంతువులు ఆ వుత్సవాల హడావిడిలో ఆకలిదప్పులు, కష్టాలూ మర్చిపోయేవి.

ఏప్రిల్ మాసంలో పశువులదివాణం రిపబ్లిక్ కింద ఎంచబడింది.

రిపబ్లిక్ అధ్యక్ష పదవికి ఎన్నికలు జరపవలసివుంది. ఆ పదవికి అభ్యర్థిగా ఒక్క గునపమే నిలబడింది; ఏకగ్రీవంగా ఎన్నుకోబడింది. ఆ రోజునే కన్నయ్య, రత్తయ్యతో లాలూచీ జరుపుతూన్న కొత్త విషయాలుగల కొన్ని కాగితాలు బయటపడినట్లు తెలిసింది. రాను రాను కన్నయ్య ద్రోహానికి సంబంధించిన కాగితాలు బైటపడుతూన్న కొద్దీ కన్నయ్య రత్తయ్యతో కుట్రపన్నుతూన్నదనీ, జంతువులమీదికి రత్తయ్యని ఉసికొల్పుతూన్నదనీ దృఢంగా జంతువులు నమ్మాయి. కన్నయ్యవీపుమీద గాయాలు గునపం దంతక్షతాలనికూడా నమ్మాయి.

డొక్కకి తగిలిన గాయం మానగానే మునపటికన్న ఎక్కువగా పంచకల్యాణి పనిచేయడం మొదలెట్టింది. నిజానికి ఆ సంవత్సరం జంతువులన్నీ బానిసల్లా పనిచేశాయి. ఒక్క గాలిమర నిర్మాణం, పొలంపనీ ఐతే అనుకోవచ్చును. పందిపిల్లల చదువు నిమిత్తం పాఠశాల కట్టవలసింది వుంది కూడాను. ఆ పని మార్చిమాసంలో ప్రారంభమైంది. ఒక్కొక్కప్పుడు కడుపులు మాడుతూన్నా, జంతువులు ఒళ్లు తెలియకుండా పాటుపడేవి. ముఖ్యంగా పంచకల్యాణి నిద్రాహారాలు మానుకుని ఒళ్లు హూనంఅయేలా పనిచేయడం సాగించింది. అందుమూలంగా రాను రాను అది బక్కచిక్కిపోవడం మొదలెట్టింది. నేల పచ్చబడగానే పంచకళ్యాణి మళ్లా కాస్త చియ్య బడుతుందని తక్కిన జంతువు లనుకున్నాయి. కాని పంచకల్యాణి రాను రాను చిక్కిపోడం జరిగింది. క్వారీకిపోయే పల్లంలోంచి నడిచిపోతూంటే పంచకల్యాణి ఎక్కడ తూలిపోయి పడిపోతుందో అని అనిపించేది. కాని, పట్టుదలే దానికి బలంగా నిల్చి కాపాడేది.అంత శ్రమపడుతూకూడా 'నేను ఇంకా ఎక్కువగా కష్టపడతాను' అని అంటూండేది. పంచకల్యాణి అస్వస్థత చూసి, ముసలి వెంకన్నా, జాకీ, ఆరోగ్యం జాగ్రత్త అని హెచ్చరించాయి. ఐనాసరే, అది దేనిమాటా చెవినిపెట్టేది కాదు.

పంచకళ్యాణికి పన్నెండు సంవత్సరాలునిండాయి. తాను పింఛినీ పుచ్చుకునేలోపుగా, గాలిమర నిర్మాణానికి సరిపోయేటంత రాయి చేర్చాలనే పట్టుదలతో అది ఎక్కువ హైరాణపడింది. అందు

మూలంగా, ఒకనాడు సాయంత్రం రాళ్లుమోసుకుపోతూంటే పంచ కళ్యానికి ప్రమాదం సంభవించింది. ఆ విచారకరమైన వార్తను రెండు పావురాలు యెగిరివెళ్ళి పశువుల దివాణంలో చెప్పాయి:

"పంచకల్యాణి పడిపోయింది. లేవలేకండా వుంది."

జంతువులన్నీ గాలిమర దగ్గిరకి పరుగెత్తాయి. లేవలేనిస్థితిలో, కళ్లు తేలవేసి, పంచకల్యాణి పడుకునుంది; వంటినిండా ముచ్చెమటలు పోశాయి; నోటమ్మట రక్తం కారుతూంది. జాకీ పంచకల్యాణిమీదకి వాలి-

"పంచకల్యాణీ! ఎలావుందిప్పుడు?" అని అడిగింది.

"ఊపిరితిత్తులు బాగాలేవు జాకీ! ఫర్వాలేదులే! జాకీ! నేను లేక పోయినా, నీవు గాలిమర కట్టడం పూర్తిచేయాలి సుమా! రాయి చాలామట్టుకు చేరవేశాను. జాకీ! నేను మహా బ్రతుకుతే ఒక నెలే నేమో! పింఛినీ పుచ్చుకునేందుకు చాలా అభిలాష పడుతున్నా. బహుశా ముసలి వెంకన్నకికూడా పింఛినీ ఇస్తారనుకుంటాను. అప్పుడు మే మిద్దరం కలిసి ముసలితనం శాంతంగా గడుపుతాము."

"పంచకల్యాణి స్థితి ఏం బాగులేదు. ఎవరైనా పరుగెత్తుకెళ్లి, సంగతంతా రాడీతో చెప్పండి!" అని జాకీ కంగారుతో అరిచింది.

జంతువులన్నీ పరుగెత్తుకెళ్ళి రాడీతో పంచకల్యాణిని గురించి చెప్పాయి. రాడీవచ్చి, ఈగలు వాలకండా, తోకతో పంచకల్యాణికి, తోలుతూన్న వెంకన్నను చూసి. —

"నేస్తం గునపం పంచకళ్యాణిస్థితి గురించి విని చాలా విచార పడింది. పొరుగునే వున్న పశువులాస్పత్రికి దానిని పంపేందుకు గునపం ఏర్పాట్లు చేయిస్తుంది. అందుచేత పంచకళ్యాణినిగురించి మనం ఏమంత కంగారు పడనవసరంలేదు." అని ధైర్యం చెప్పింది. పశువులాస్పత్రికి పంచకళ్యాణిని పంపడం గురించి వినగానే, జంతువులన్నీ ఓ క్క మొహం వేశాయి. ఒక్క కన్నయ్యా, పంకజాక్షీ తప్ప, మరే ఇతర జంతువూ, అంతవరకూ పశువులదివాణం విడిచి బైటకిపోలేదు. చికిత్స

నిమిత్తం మానవుల చేతుల్లో పంచకళ్యాణిని పెట్టడానికి జంతువులు భయపడ్డాయి. ఒక అరగంటతర్వాత శక్తితెచ్చుకుని పంచకళ్యాణి లేచి నిలబడింది. జాకీ వెంకన్నల సహాయంతో - నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్లి, అది తనసాలలో పడుకుంది.

రెండు దినాలవరకూ, పంచకళ్యాణి సాలలోంచి బైటికి కదలలేదు. దివాణం భవనం స్నానాలగదిలో ఏదో ఎర్రమందు కనిపిస్తే, పంచకళ్యాణికిమ్మంటూ పందులు ఆమందును జాకీకి అందజేశాయి.

వెంకన్న పక్కని పడుకుని తోకతో ఈగలు తోలుతూంటే, పంచకల్యాణి, జాకీతో పిచ్చాపాటీ మాట్లాడుతూ కాలం గడిపేది.

"నేస్తాలూ! జరిగిందానికి నేనేం విచారపడడంలేదు. జబ్బు నిమ్మళించి మళ్లా తేరుకున్నానంటే, మరో మూడు సంవత్సరాలు బ్రతుకుతాను. ఐనా పనిచేయను, పింఛిని పుచ్చుకుంటాను. నేస్తాలూ! నేను చచ్చిపోయే లోపుగా మిగతా అక్షరాలన్నీ నేర్చుకోగల నంటారా!"

తీరిక సమయాల్లో, జాకీ వెంకన్నా పంచకల్యాణి దగ్గర కూర్చునేవి. పంచకల్యాణిని ఆస్పత్రికి తీసుకు పోయేందుకు మధ్యాహ్నాంపూట బండి వచ్చేది. ఒకనాడు పొలంలో జంతువులన్నీ పని చేస్తుండగా, బిగ్గరగా అరుస్తూ వెంకన్న పరుగెత్తుకుంటూ వచ్చింది. అదే మొదటిసారి వెంకన్న అంత విసురుగా పరుగెత్తుకు రావడము. జంతువులన్నీ ఆశ్చర్యపోయాయి.

"చప్పున! చప్పున రండి! వాళ్లు పంచకళ్యాణిని ఎత్తుకు పోతున్నారు."

వాటి పైఅధికారి పందిదగ్గర సెలవైనా పుచ్చుకోకుండా, జంతువులు పరుగెత్తాయి. భవనం దొడ్లో బండి నిలబడింది.ఆ బండీ చుట్టూ అవి చేరి :

"పంచకల్యాణీ! వెళ్లిపోతున్నావా! జాగ్రత సుమా! అని గొల్లుమని యేడ్చాయి.

"మతులేవు మీకు! ఆ బండిమీద ఏం వ్రాసివుందో చదివారా?" అని కోపంగా వెంకన్న అరిచింది. జంతువులన్నీ బిక్క మొహాలేసి, ఆ బండిమీద వ్రాసిందేమిటో చదవమని పిచ్చాణ్ణడిగాయి. అన్నింటినీ తోసుకుంటూ ముందుకు వచ్చి వెంకన్న :

"సత్తార్ సాహెబ్-తోళ్ళ వ్యాపారం!"-"నేస్తాలూ! ఆ బండి మీద వ్రాసిన మాటలు అర్థమయాయా? ఇప్పటికైనా తెలుసుకోండి. పంచకల్యాణి కసాయి-కలాకి పంపించబడుతూంది. అక్కడ దానిని చంపేస్తారు. ఈ మాటైనా తెలిసిందా పంచకల్యాణికి, ఏం జరగబోతూందో?" అని ఒక్కపెట్టున యేడ్చింది. జంతువులు కూడా భయంతోనూ, కోపంతోనూ ఏడ్చాయి. బండీవాడు, బండి తోలుకు పోతూంటే, అవన్నీ వెనకాతలపడి పరుగెత్తాయి. జాకీ ముందుకు, బండి దగ్గరగా పరుగెత్తి "పంచకల్యాణీ! పంచకల్యాణీ! పంచకల్యాణీ!" అని అరిచింది. బండి కిటికీలోంచి ముఖం ఇవతలపెట్టి పంచకల్యాణి చూడగనే, "పంచకల్యాణీ! బైటికి ఉరికెయ్! ఉరికెయ్! చంపడానికే వాళ్లు నిన్ను తీసుకుపోతున్నారు! నామాట విని, ఒక్క తాపుతన్ని తలుపు తెరచుకుని బైట కురికేయి!" అని జాకీ ఎన్నో విధాల పంచకల్యాణిని వేడుకుంది.

'ఉరికేయ్!' మంటూ జంతువులు కూడా మొరపెట్టాయి. బండి జోరుగా పోతూంది. జాకీ మాటలు పంచకల్యాణికి వినిపించాయో, లేదో తెలియదు. వినిపించినా అర్థమైందో లేదో! కాని కొద్దినిమిషాల తర్వాత బండి కిటికీలో పంచకల్యాణిముఖం కనిపించలేదు. బైటకి మాత్రం, బండిలో పంచకల్యాణి గిల గిల తన్నుకుంటూన్న శబ్దం వినిపించింది. శక్తిలేకపోయింది కాని, లేకపోతే, ఆ తన్నులకి బండి విడిపోయి పంచకల్యాణి తప్పించుకు బైటపడివుండేది. జంతువు లేమీ చేయలేక బండి లాగుతూన్న ఎడ్లతో, "నేస్తాలూ! మీతోడి సోదరుణ్ణి మృత్యువుకి బలివేసేందుకు లాక్కుపోకండి. ఆగండి. పంచ కల్యాణిని రక్షించండి" అని మొరపెట్టాయి. కాని అవి ఉత్త ఎద్దుమొద్దు స్వభావాలవడంచేత తోడిజంతువుల మాటలు అర్థం చేసుకోలేక,

ముందుకు బండిని లాక్కుపోసాగాయి. చివరకు బండిని పోనీయకుండా ఉండేందుకు, దివాణం పెద్దగేటు మూద్దామని ప్రయత్నించినా లాభం లేకపోయింది. జంతువుల మధ్యనుండి పంచకల్యాణి వెళ్ళిపోయింది. మళ్ళా కనిపించ లేదు.

మూడుదినాల తర్వాత, ఆస్పత్రిలో పంచకల్యాణి మరణించి నట్లు, రాడీ వచ్చి జంతువులతో చెప్పింది.

"ప్రాణం పోయేవరకూ దానిదగ్గరే ఉన్నాను. గాలిమర పూర్తికాకుండా చచ్చిపోతున్నానే అని ఏడ్చింది. 'ముందంజ వేయండి నేస్తాలూ! విప్లవంపేరు చెప్పుకుని ముందుకు నడవండి! చిరకాలం పశువుల దివాణం నిల్చుగాక! గునపం మాట జవదాటకండి' అంటూ మనకి అంతిమ సందేశ మిచ్చింది," అంటూ రాడీ కన్నీరు తుడుచు కుంటూ పంచకల్యాణి చివరి ఘడియల గురించి చెప్పింది.

అంతలోకే రాడీ చూపుల్లో నక్కజిత్తులమారితనం గోచర మైంది. ఏదో అనుమానంతో, అటూ ఇటూ తోక ఆడిస్తూ చూసింది. పంచకల్యాణిని కసాయివానికి అమ్మినట్లు వదంతి పుట్టిన సంగతి గ్రహించింది.

"నేస్తాలూ! మీఅంత తెలివితక్కువ జీవాలను నే నెక్కడా చూడలేదు. మన నాయకుడు గునపం కంటె మీకెక్కువ తెలుసునా? దేశభక్తిగల పంచకల్యాణిని ఒక కసాయివానికి అమ్మినట్లు మీరు నమ్ముతున్నారా? అంత నీచమైన, క్రూరమైన పని మన బాగు కోరే నేస్తం చేయగలడా! బండిమీద కసాయి సాయిబు పేరున్నంత మాత్రంచేత మన నాయకుణ్ణి అనుమానించడం న్యాయమేనా? ఈ మధ్యనే ఆ బండిని పశువుల డాక్టరుగారు కొన్నారు. కొన్నాక ఆ పాతపేరు చెరిపించివేయడం మరచిపోయారు. పేరు చూసినంత మాత్రంచేత, మన గునపంమీద అటువంటి అపనింద మోపడం తప్పుకాదూ? ఈ మాటైనా నామాట నమ్ముతారా లేదా?"

కాడీ మాటలు విని, జంతువులన్నీ సంతృప్తితో పెద్ద నిట్టూర్పు పుచ్చాయి. గునపంగురించి పడిన దురభిప్రాయానికి నొచ్చుకున్నాయి.

ఆదివారం ఉదయం సమావేశానికి గునపం హాజరై పంచకల్యాణి ఆత్మశాంతికై ప్రార్థనలు జరిపి దాని గుణగణాలను శ్లాఘిస్తూ ఉపన్యసించింది.

"నేస్తాలూ! మనకు ఆప్తమైన నేస్తం అస్థికలు తీసుకు వచ్చేందుకు వీలుపడిందికాదు. కాని ఒక పెద్ద మాల తయారుచేసి దాని సమాధిపై ఉంచమని కబురు చేశాను. కొద్ది దినాల్లో పంచకల్యాణి స్మృతిచిహ్నంగా పందులన్నీ కలిసి స్మారకదినం చేయడానికి యత్నాలు సల్పుతున్నాయి. పంచకల్యాణి జీవితాదర్శాలు రెండే: 'ఇంతకన్నా ఎక్కువ కష్టపడి పనిచేస్తాను. నేస్తం గునపం ఎప్పుడూ న్యాయమే చేస్తాడు.!' ఆ రెండు ఆదర్శాలను మీరంతా, మీమీ జీవితాల్లో అలవరచుకుని, అనుసరించండి. అప్పుడే మీరంతా పంచకల్యాణి ఆత్మకి శాంతి చేకూర్చినవా రవుతారు!"

స్మారకదినంనాటి రాత్రి, భవనంలో చాలా అలజడి కల్గింది. గొంతుకు చించుకు పాడ్డం వినిపించింది. తర్వాత దెబ్బలాడుకుంటూన్న గొడవ వినిపించింది. డబ్బు నేదో విధంగా సంపాదించి పందులు సారా కొనుక్కు తెచ్చుకు తాగినట్లు పుకారు చెలరేగింది.

# ౮

ఏళ్లు గడిచిపోయాయి. పుడుతూన్న జంతువులు పుడుతూనే వున్నాయి. చచ్చిపోతూన్న జంతువులు చచ్చిపోతూనే వున్నాయి. జాకీ, వెంకన్నా, మరికొన్ని పందులూ తప్ప తక్కిన జంతువులన్నీ, విప్లవం ముందువాటి జీవితానుభవం మర్చిపోయాయి.

పిచ్చాడు చచ్చిపోయింది; కుక్కలు చచ్చిపోయాయి. రత్తయ్య కూడా చచ్చిపోయాడు. కన్నయ్య పూర్తిగా నా విస్మరంతైపోయింది. పంచకల్యాణికి సన్నిహితంగా ఉన్న జంతువులుతప్ప తక్కినవి దానిని గురించి పూర్తిగా మర్చిపోయాయి. జాకీ ముసలి దైపోయింది. కీళ్లవాతంతో బాధపడుతూంది. పింఛినీ పుచ్చుకోవలసిన వయస్సువాటి రెండు సంవత్సరాలైపోయినా, జాకీ పింఛినీ పుచ్చుకోలేదు. గునవం వయస్సు మీరుతూన్న కొద్దీ లావెక్కడం మొదలెట్టింది. రాడికి నఖశిఖ పర్యంతం కొవ్వు పెరిగిపోయింది. దవడలు విపరీతంగా పొంగిపోయి కళ్లు మూసివేశాయి. ఒక్క వెంకన్నలో మాత్రం ఎటువంటి మార్పూ రాలేదు. పంచకల్యాణి చనిపోయినప్పణ్ణించీ బెంగా, ఒంటరితనం హెచ్చిపోయింది.

కాలం గడుస్తూన్నకొద్దీ పశువుల దివాణంలోని పశువుల సంఖ్య హెచ్చింది. కాని ఆ కొత్తగా పుట్టి పెరుగుతూన్న జంతువులకి విప్లవం ఒక కట్టుకథైంది. కొన్ని జంతువులు బైటనుంచి లోనికి వచ్చాయి. జాకీకాక మరొక మూడు గుర్రాలున్నాయి. అవి మంచి బాగా వళ్లువంచి పనిచేస్తాయిగాని, తెలివి తేటలునాస్తి. ఒక్క గుర్రానికీ, 'ఆ' తర్వాత మరొక అక్షరం, ఎంత నేర్చుకొన్నా వచ్చిందికాదు. విప్లవం గురించి విన్నాయి. పశుస్వామిక సిద్ధాంతాలను తెలుసుకున్నాయి. అక్షరాలా వాటిని ఆచరణలో పెట్టాయి. జాకీ అంటే ఆ గుర్రాలకి పరమభక్తి, గౌరవమూను.

పశువుల దివాణం సస్యశ్యామల భరితమైంది. మునపటికంటే పనులు బాగా సక్రమంగా సాగుతున్నాయి. పోతురాజు దగ్గరనుంచి మరో రెండు పొలాలు కొనడమైంది. గాలిమర నిర్మాణం పూర్తైంది. కుప్పలునూర్చే యంత్రం, గడ్డిపోగుచేసి కుప్ప వేసేయంత్రం, అమర్చబడ్డాయి. పశువులదివాణం భవనాలకి పరికొత్త కొత్తభవనాలను జత కూర్చడమైంది. గాలిమరద్వారా విద్యుచ్ఛక్తి పుట్టించేందుకు చేసిన ప్రయత్నాలు సఫలీకృతం కాలేదు. పిండి తయారుచేయడంవల్ల ఆ మర లాభదాయకంగా తోచింది. మరొక గాలిమర నిర్మాణానికై జంతువులన్నీ కష్టపడ్డాయి. కన్నయ్య కన్న కలలన్నీ అబద్ధమని, విద్యుచ్ఛక్తి సహాయంవల్ల కల్గే సుఖాలు పశుస్వామిక సిద్ధాంతంతో సరితూగవని, నిజమైన సుఖమూ, ఆనందమూ కష్టపడి పనిచేసి, మితసరిగా జీవించడంలోనే ఉందని గునకం తిరిగి విడమర్చి చెప్పింది. జంతువులకి గతం బొత్తిగా జ్ఞాపకం వచ్చేది కాదు. ఐతే, ప్రస్తుత జీవితం, దేంతో పోల్చుకుని బాగోగులు తెలుసుకోగలవ్? ఒక్క ముసలి వెంకన్నకి మాత్రం భూతభవిష్యత్ వర్తమానాల గురించి తెలుసును. ఒక్కలాగే జీవితం- ఒడుదుడుకులతో కష్టాలతో ఆకలితో నిరాశతో ఉంటుందని, అది అనుకునేది.

ఐనా సరే జంతువులుమాత్రం ఆశను వీడలేదు. పశువుల దివాణానికి చెందిన సంగతి తల్చుకు గర్వపడి, సంపాదించుకున్న స్వేచ్ఛకోసం సమస్తం త్యాగంచేశాయి. బావుటా యెగరవేసి, తుపాకీ పేలుస్తూంటే, ఆనందంతో, గర్వంతో, విప్లవాన్ని గురించీ, రత్తయ్య తిరోగమనంగురించీ, సప్తవిధులను గోడమీద వ్రాయడం మొదలైన వీరోచిత గాథలను మనస్సుల్లోమననం చేసుకుంటూ బావుటాక్రింద జంతువులు మోకరిల్లేవి. స్వర్గస్థురాలైన ముసలిపంది కల నెవ్వరూ మరవలేదు. ఎప్పటికైనా విశాల విశ్వమంతా, ఏకచ్ఛత్రాధిపత్యంతో, పశువులు ఏలుతాయనే వాటి విశ్వాసం. ఆ శుభదినం, ఎప్పటికో అప్పటికి ఆసన్న మవుతుంది; త్వరలో కాకపోవచ్చు. పశువులదివాణంలో జీవించే ఏ జంతువూ, తన జీవితకాలంలో,

ఆ కల రూపం తాల్చడం చూడకపోవచ్చును. కాని ఆ శుభదినం రావడం మాత్రం నిశ్చయం.

'మృగజీవాలు' జాతీయగీతం అక్కడక్కడ రహస్యంగా, ఆ దివాణంలో వినిపిస్తూనేవుంది. వాటి జీవితం అంత సుఖమయంగా లేదని జంతువులకి తెలుసును. అయినా, నరహంతకుల క్రూరత్వంచేత కాదని సంతృప్తి పడ్డాయి. సరదాకైనా, మానవులను వెక్కిరించేందుకైనా, ఏ జంతువూ రెండు కాళ్ళమీద నడవలేదు. ఏ జంతువూ మరో జంతువుని యజమానిగా పరిగణించలేదు. అన్ని జంతువులూ సమానమనే భావించాయి.

తిరిగి మండువేసంగి వచ్చింది. ఒకనాడు మేకలన్నిటినీ, పొలం చివర కలుపు పెరిగిన చెక్కలోకి వెళ్ళి పని చేయమని రాడీ ఆజ్ఞాపించింది. రోజంతా ఎండలోబడి అవి కలుపు తీశాయి. సాయంత్రం పడగానే అవి దివాణం చేరబోతూంటే రాడీ, "పని పూర్తయేవరకూ మీ రక్కడే వుండిపోవాలి!" అని అది చీకటి పడగానే తనగది చేరుకుంది. మేకలు కనిపించక పోవడంచూసి జంతువులు ఆశ్చర్యపోయాయి. పూర్తిగా పని అయేంతవరకూ రాడీ మేకలతో ఉండేది. జంతువులు ఆగలేక మేకల వైనం రాడీ నడిగాయి.

"ఆఁ! ఎక్కడికి పోతాయి! వాట్లకి కొత్తపాట నేర్పుతున్నాను. ఆపాట నేర్చుకుందుకు కొంత మాటు కావాల్సివుండి. అందుకే వాటిని చాటుగా ఉంచాను."

మేకలన్నీ తిరిగి వచ్చేసిన మర్నాడు సాయంత్రం, పనినుండి కులాసాగా నడిచి వస్తూన్న జంతువులకి గుర్రం సకిలింపు వినబడింది. హడలెత్తిపోయి, ఎక్కడి వక్కడ నిలబడి పోయాయి. తర్వాత జాకీ సకిలించడానికి కారణం తెలిసింది.

రాడీ వెనకాకాళ్ళమీద నడుస్తూంది. మరో నిమిషానికి, దివాణం భవనంలోంచి పందులన్నీ; వెనకాకాళ్ళమీద నడుస్తూ బైట కొచ్చాయి. పందుల వెనకనే అరుస్తూ కుక్కలూ, కొక్కొరోకో

అంటూ కోడీ, తర్వాత ద్వారాగా తీక్ష్ణంగా నలుదిక్కులా చూస్తూ గునపమూ వచ్చాయి. తన ముందటి పాదాల రెంటితోటీ ఒక కొరడా పట్టుకుంది.

అంతా నిశ్శబ్దంగావుంది. దొడ్డిచుట్టూ కవాతుచేస్తూ నడుస్తూన్న పందులను చూసి. జంతువులు భయపడిపోయి, ఆశ్చర్య పోయాయి. ప్రపంచమంతా తలక్రిందు లైనట్లు తోచింది వాటికి. జంతువులు గునపంతో మాట్లాడుతూ మనుకునేప్పటికి, గొర్రెలూ, మేకలూ, "చతుష్పాదులు మంచివి, ద్విపాదులు చెడ్డవి" అని అరిచాయి.

ముసలితో జాకీ, వెంకన్న చట్టనాకి, రహస్యంగా ఏదో చెప్ప డానికి. సప్తవిధులూ వ్రాసిన గోడదగ్గరికి తీసికెళ్ళింది. ఒక నిమిషం సేపు అవిరెండూ గోడవైపు చూస్తూ మాట్లాడకండా నిలబడ్డాయి.

"నాచూపు బొత్తిగాపోయింది వెంకన్నా ! ఐనా ఆగోడ మున పటిగోడలా వుందంటావా ? ఇప్పుడున్న సప్తవిధులూ, మునపటిలాగే వున్నాయంటావా ?"

వెంకన్న గోడమీద వ్రాసినది చదివి జాకీకి వినిపించింది. పూర్వపు సప్తవిధులకి బదులుగా, ఒకే ఒక సూత్రం వ్రాసివుంది—

"సమస్త జంతువులూ సమానము ; కొన్ని కొన్ని జంతువులు మాత్రం. తక్కిన జంతువులకంటె ఎక్కువగా సమానము."

పశువుల దివాణంలో సరిగ్గా పనులు జరుగుతున్నాయా, లేందీ తనిఖీ చేసేందుకు నియమించబడిన పందులు కొరడాలు పట్టుకు రావ డంలోని రహస్యం జంతువులు గ్రహించాయి. ప్రస్తుతం గోడమీద వ్రాసిన సూత్రంలోని అర్థం పందుల జులుములో కనబడింది.

పందులు ఒక రేడియో సెట్టుకొనుక్కున్నాయి, టెలిఫోను కూడా అమర్చేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. వార్తాపత్రిక లనుకూడా తెప్పించుకోడం మొదలెట్టాయి. దివాణంలోవున్న జమీం

దారుగారి దుస్తులు వేసుకుని, సిగరెట్లు కాల్చుకుంటూ గునపం వాహ్యాళి వెడుతూంటే, ప్రక్కనే జమీందారిణి పట్టుచీరలూ ఆభర ణాలూ మొదలైనవి ధరించి, గునపం ప్రియురాలు—ఆడపంది— నడుస్తూండడం చూసి జంతువులు విస్తుపోయేవి.

గునపం ఆహ్వానం పురస్కరించుకుని, ఒకనాడు మధ్యాహ్నం, చుట్టుప్రక్కల వున్న రైతులు పశువుల దివాణం చూసే నిమిత్తం వచ్చారు. పందులు వారిని దివాణం చుట్టూ తిప్పి అన్ని వింతలూ చూపాయి. గాలిమర చూసి రైతులు చాలా మెచ్చుకున్నారు. ఆ సమయంలో, ముల్లంగి దుంపల మళ్లల్లో పెరిగిన కలుపు తీసే పనిలో నిమగ్నమై ఉన్నాయి జంతువులు. పందులనుచూసి భయపడాలో, మానవులను చూసి భయపడాలో తెలియక, వంచినతల లెత్తకుండా నాటి మానాన్ని అవి పనులు చేసుకుంటున్నాయి.

ఆ సాయంత్రమే దివాణం భవనంలోంచి పందులూ, మాన వులూ కలిసి కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, మధ్యమధ్య నవ్వుతూ పాడుతూ వుండడం జంతువులకి తెలిసి, అవి ఆశ్చర్యపోయి, భవనం లోపలికి చూడ్డానికి కుతూహల పడ్డాయి. సమాన స్థాయిలో, జంతు వులూ, మానవులూ కలియగా చూడ్డం, జంతువుల కదే మొదటిసారి!

జంతువులు, చప్పుడు చేయకుండా దివాణం తోటలోకి వెళ్లి, భవనం అరుగులుచేరి మెడ లెత్తి కిటికీగుండా భోజనాల గదిలో ఆసీనమైవున్న పందులనూ, మానవులనూ చూశాయి. పందులుకూడా మానవులతో బాటు కుర్చీలో కూర్చున్నాయి. పేకాట ఆడుతున్నాయి, మధ్యమధ్య సారా తాగుతున్నాయి.

గోతురాజు లేచి ఉపన్యసించడం ప్రారంభించాడు:

"కొంత కాలంనుండి మన మధ్య ఉంటూన్న అవిశ్వాసం, అను మానం, అసూయ నేటితో పటాపంచలమైంది. ఒకానొక కాల ముందు— నేను తప్ప—తక్కిన మానవులందరూ, పశువుల దివాణం

పట్ల శత్రుత్వం వహించారు. తత్ఫలితంగా, విచారకరమైన సంఘటనలు సంప్రాప్తమయాయి. దానికి కారణం ఇతరుల దుష్ప్రచారమే. పందుల పరిపాలనలో దివాణం ఉన్ననాడు, చుట్టుపక్కల దివాణాలకి ముప్పు వాటిల్లుతుందని, అందరూ అనుకున్నారు. ఇతర దివాణాలలోని పశువులుకూడా తిరుగుబాటు సల్పుతాయని భయపడ్డారు. చివరకు నేటికి ఈదివాణాన్ని చూడకల్గే భాగ్యం కల్గినందుకు నేస్తం గునపానికి నాకృతజ్ఞత. ఇంతవరకూ ఏర్పడిన పరస్పరవైషమ్యానికి నేటితో స్వస్తి! నేస్తాలూ! మీరెంత అద్భుతంగా పరిపాలన సాగిస్తున్నారు! నిజంగా పొరుగునున్న మేమంతా, మీనుంచి ఎంతేనా నేర్చుకోవలసి వుంది. అంతే ఆదర్శప్రాయంగా, మీరు దివాణాన్ని పరిపాలిస్తున్నారు. తక్కువ అంతస్తులోనున్న జంతువులు ఎక్కువ కష్టపడుతున్నాయి, తక్కువ ప్రతిఫలం పొందుతున్నాయి. ఈసూత్రాన్నే, మాదివాణాలలోకూడా ఆచరణలో పెడతాము.

"నా ఉపన్యాసం ముగించేముందు, ఒక్క రెండు మాటలు మనవి చేస్తాను. మళ్లా తిరిగి చెపుతున్నా! పశువుల దివాణంతో, పొరుగునున్న దివాణాలన్ని సఖ్యతగా ఉంటాయి. మిత్రత్వమే కాని, శత్రుత్వం ఎంతమాత్రం లేదు. మానవులకీ, పందులకీ ఏవిషయంలోనూ పోటీలేదు. ఇక ముందుకూడా పోటీవుండకూడదు. మన సుఖదుఃఖాలు సమానము. కార్మిక సమస్య అంతర్జాతీయమైందేగా? ప్రస్తుతం మీరు, మీలోవున్న తక్కువ తరగతి జంతువులతో రగడ పడుతున్నారు. మాలోమాత్రం తక్కువతరగతి మానవులు లేరంటారా? వారితో మేము ప్రతిదినం యుద్ధం చేస్తూనే వున్నాము''.... అని పోతురాజు పందులకందరికీ తన కృతజ్ఞతాపూర్వక వందనా లర్పించి కూర్చోగానే, కరతాళధ్వనులు చెలరేగాయి. మళ్లా కొంచెంసేపు త్రాగారు. తర్వాత గునపం వెనక్కాళ్లమీద లేచి నిలబడి—

"నేస్తాలూ! నేను ఎక్కువసేపు మాట్లాడి మిమ్మల్ని విసిగించను. మానవులకీ, మనకీ మధ్య ఉంటూన్న దురభిప్రాయాలు, అపోహ, నేటితో నశించిపోయినందుకు, నేను చాలా సంతోషిస్తున్నాను.

చాలాకాలంబట్టి, నాపైనా, నాబృందంపైనా, లేనిపోని పుకార్లు చెలరేగుతున్నాయి—నేను, ఏదో, పొరుగునున్న జంతువులలో, పశుస్వామిక సిద్ధాంతాలను ప్రచారంచేసి విప్లవం తీసుకురాబోతున్నానని—కాని నేస్తాలూ! నామాట నమ్మండి. పొరుగువారితో మైత్రి పెంచుకుందామనే నా అభిలాష కాని శత్రుత్వం వహిద్దామని, ఎంతమాత్రం కాదు. నా స్వాధీనంలో నున్న ఈ పశువుల దివాణం సహకార పద్ధతిమీద నడుపుతున్నాను. కవుల్లు కదపాల నన్నిటినీ పందులన్నీ కలిసి సమిష్టిగా వ్రాసుకున్నవే. పూర్వంనుంచీ వుంటూన్న అనుమానాలను పటాపంచలం చేసేందుకుగాను ఈమధ్యనే పశుస్వామిక సిద్ధాంతాలను కొద్ది మార్పులతో క్రోడీకరించాను. ఇకనుంచి, మనందరి మధ్య, ఎటువంటి అపోహాలు, మనస్పర్థలూ ఉండవని నా విశ్వాసము. ఇంతవరకూ తెలివి తక్కువగా, జంతువులు ఒక దానినొకటి 'నేస్తం' అని పిలుచుకునే అలవాటు కలవరచుకున్నాయి. ఇకముందునుంచి, ఆవిధంగా పిల్చుకోడానికి వీలు లేదని శాసించబోతున్నాను. ప్రతి ఆదివారం వుదయం జంతువులన్నీ సమావేశమై ముసలిపంది తలకాయ చెంత మోకరిలడం అలవాటు. ఆ అలవాటుకూడా తప్పించివేసి, ఆ తలను పాతిపెట్టించి వేస్తాను. ఇంక బావుటా విషయం: బావుటామీద డెక్కా, కొమ్మూ తీయించివేసి ఉత్తజండానే ఎగరవేయించ దలచాను. మిత్రుడు పోతురాజు ఉపన్యాస సందర్భంలో పశువులదివాణం, పశువులదివాణం అంటూ వచ్చారు. మా సహకార సంస్థ కాపేరు తీసివేసి, పూర్వంనుంచీ ఉన్న 'దివాణం' అన్న పేరే ఉంచదలచాను.

"మిత్రులారా! మీరంతా వచ్చి, మమ్మల్ని ఆనందపరచినందులకు, మా పందులతరుఫున మీకు నా కృతజ్ఞత తెలుపుతున్నా"నని గునపం సారా గ్లాసు పట్టుకు త్రాగుతూ కూర్చుంది.

గునపం ఉపన్యాసం పూర్తికాగానే, తిరిగి కరతాళధ్వనులు చెలరేగాయి. బైటనుంచి చూస్తూన్న జంతువులకి, పందులలో దో మార్పు కనిపించింది. అర్థంచేసుకోలేక, ప్రశ్నార్థకంగా జాకీ,

ఒక్కొక్క జంతువు ముఖం కేసి చూసింది. కొన్ని పందుల ముఖాల్లో ఐదేసి గడ్డాలు, కొన్నిటిలో నాలుగూ, కొన్నిటిలో మూడూ కనిపించాయి. కాని అదేమిటి? అలా కరిగిపోతూ మారిపోతూన్న దేమిటది? మళ్లా భోజనాల గదిలో నిశ్శబ్దం. పేకాట ఆడేందుకు పందులూ, మానవులూ ముందుకు బల్లమీదకి వంగారు. జంతువులన్నీ, తిరిగి నెమ్మదిగా, పాకుకుంటూ బైటకి వెళ్ళిపోయాయి.

ఇరవై గజాలదూరం వెళ్లాయో లేదో, జంతువులన్నీ ఒక్కసారి ఆగాయి. భోజనాలగదిలోంచి పెద్దగొడవ వినిపిస్తోంది. అవి వెనక్కి పరుగెత్తి, కిటికీలోంచి భోజనాలగదిలోకి తొంగిచూశాయి. మానవులూ పందులూ, దెబ్బలాడుకుంటున్నారు—గట్టిగా కేకలూ, బల్లమీద గుద్దడాలూ అనుమానపు చూపులూ. దెబ్బలాటకి కారణం ఏమిటంటే, గునపం పోతురాజూ ఒక్కసారిగానే ఇస్పేటాసు ఆడడం చేత.

కోపంతో పన్నెండు గొంతుకలు అరుస్తున్నాయి. అన్నీ ఒకే పోలికనున్నాయి. పందుల ముఖాలలో కల్గిన మార్పుకి ఆ గొంతుకలే నిర్ధారణ. బైటనుంచి జంతువులు, పందివైపు ఓమారూ, మానవుని వైపు ఓమారూ, చూశాయి. మనిషిని ఓమారూ, పందిని ఓమారూ చూశాయి. పందిని చూసి, మళ్లా మనిషిని చూశాయి. కాని ఏదిపందో, ఏదిమనిషో పోల్చుకోలేక పోయాయి!

2½·Rs 1-0-0
7/3/53



Printed at Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras 14.

అచ్చుకానున్న పుస్తకాలు :

ప్రే మ లే ఖ లు.

టాల్ స్టాయ్ :

కామవర్ధని రాగము—నవల.

(అనువాదము)

రేడియో నాటికలు—

క థ లు.